

భారత దేశంలో పర్యటించవచ్చిన అంధ రచయిత్రి
డా॥ హెలెన్ కెల్లర్, ఆమె కార్యదర్శిని



భారత వ్యవసాయిక పరిశోధనా సంస్థ స్వర్ణోత్సవముజరిగింది - పైచిత్రము
న్యూఢిల్లీలోని పూసా ఇన్‌స్టిట్యూట్ భవనము




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకుగాను తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వస్వామ్యములు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక


వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య



సంపుటము ౨౪]   ఏప్రిల్ 1955   [సంచిక ౪

# వి ష య సూ చి క



నిరీక్షణ




జయ జయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయ జయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఆంధ్రలో మంత్రివర్గ నిర్మాణం

మన్మథ సంవత్సరారంభముతోబాటు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి నాయకత్వము క్రింద ఏర్పడిన ఆంధ్ర మంత్రివర్గమును హృదయ పూర్వకముగా నభినందిస్తూ స్వాగతం చెప్తున్నాము.

ఆంధ్రలో జాతీయ నాయకత్వము గడచిన ఎన్నికల ఫలితముల దృష్ట్యాబలీయమగుట హర్షించతగినది. కాని యీ జాతీయ నాయకత్వము మరింతగా సంఘటితపడి ఏకోన్ముఖంగా ఆంధ్రలో ప్రజాహితాన్ని, పురోభివృద్ధిని రూపొందించవలసిన బాధ్యత అత్యంత గురుతరమైనదను విషయము విస్మరించరానిది. దీనిని ప్రజాప్రతినిధులుగా ఎన్నికైనవారు చిత్తశుద్ధితో గుర్తించి పరిపాలనా విధానాన్ని రూపొందించడానికి సహకరిస్తే ప్రజాస్వామ్య వ్యవస్థ పదిలము కాగలదు.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

(గతసంచిక తరువాయి)

ఏ అనుభవముకలుగవలెనన్నను, మూడు అంశములు ఆవశ్యకమని వారు నిర్ణయించిరి. అనుభవించుకర్త, అనుభవింపబడుకర్మ, ఈ కర్తకు కర్మకు సంబంధము కలిగించు అనుభవము, క్రియ, ఈ మూడు అంశములును, ఒకనిర్ణీతకాల, దేశమున వ్యవహరించిననే, అనుభవము సిద్ధించును.

నవీన ప్రకృతి శాస్త్రజ్ఞులుకూడ ఒక విధమున సత్యమూలమును కనుగొనుటతో గొప్ప విమర్శకులని చెప్పవలసియున్నది. కాని వారి విమర్శనా రంగము కర్మ, అనుభవింపబడు విషయ రంగములతో ముగియుచున్నది. ఇందు నేరు విరుద్ధముగా పూర్వకాలపు మహా ఋషులు, ఆంతర ప్రపంచ విమర్శకి శాస్త్రజ్ఞులు, అనుభవించు కర్తను విమర్శించి సత్యమూలమును వెదుక నారంభించియుండిరి. ఇదియే కర్తయొక్క ప్రపంచ రంగము. ఇట్లు ఇరువురు శాస్త్ర పరిశీలకులు అయినను, వారి విచార ఆవరణ రంగమునందును, విచారించు పద్ధతి వ్యవహారముల యందును వ్యత్యాసము కలిగియున్నది.

మఱి నవీన శాస్త్రజ్ఞుల పద్ధతులకంటె ప్రాచీన ఋషుల పద్ధతులు చాల పరిపక్వతగలిగి యుండెనని మీరు తెలుసుకొనగలరు. బహుశా 18-వ శతాబ్దమున ఇట్టి కఠిన వాక్యమును ప్రకటించు సాహసము మనకు యుండకపోవచ్చునుకాని, ప్రస్తుతము, అణువును (ఆటం) పగులకొట్టగలిగి, దానియందుండు అంశములు, ప్రచారములోనుండు విద్యుచ్ఛక్తియేయని కనుగొనిన వెనుక, ఇతర శాస్త్రజ్ఞులుకూడ ప్రకృతి శాస్త్రము, ఇక మానవ మనసును విమర్శించుట యొకటియే మిగిలియుండునది. దాని నిర్మాణ విధాయకము, స్వభావము, వ్యవహారములు విమర్శించుట ఆవశ్యకమని నుడివి యున్నారు.

ఋషులు, ఉపనిషద్ నిర్మాతలు, వేరు మార్గమును అవలంభించియున్నారు. ప్రపంచమునందలి విషయ సముదాయముల నన్నిటిని, అయిదు ముఖ్య నమూనాలుగా విభజింప సాధ్యమగుచున్నది. రూపము, శబ్దము, వాసన, రుచి, స్పర్శ — వీటిని వదలిన, ప్రపంచ విషయములు మనకు ఏమియు తెలియదు. ప్రకృతి శాస్త్రజ్ఞులు అందరు వీటిని గురించియే కృషి చేయుచున్నారు. ఇది ఎట్లున్నదియనిన, మనకు అయిదు రకముల రంధ్రములుండి, ఆ రంధ్రముల గుండా ఒకడు ప్రపంచమువైపుచూచి, తనకు తెలిసినంత మాత్రము వర్ణించుచు వచ్చిన యెడల మనము ఎట్లు వాటి జ్ఞానము పొందగలమో అట్లున్నది. ఈ వ్యవహారము మన మనసు, తన పంచ ఇంద్రియ వ్యవహారములవల్ల పొందు జ్ఞానమును క్రోడీకరించి సారము తేల్చుటవల్ల బాహ్య ప్రపంచ జ్ఞానము మనకు కలుగుచున్నది.

మనలో జ్ఞాన ప్రకాశ అంశము ఒకటియుండి, ఈ బాహ్య ప్రపంచమును, తనలో జాగ్రత్తగా తెలుసుకొనుచు యుండకపోయిన, వీటితో మనకు ఎట్టి ప్రయోజనము, అర్థము యుండజాలదు. వేదకాలపు నిరంతర ఆలోచనాపరులు మానవాతీత ఊర్ధ్వ దృష్టితో, నమ్మించు సమాధానములతో, బాహ్య ప్రపంచమంతయు ఈ వ్యవహరించు మనసుయొక్క స్వరూపములే— వేరుకాదు అని తీర్మానించియున్నారు. (దీనికి కావలసిన సమాధానములు మాండూక్య, కారికల ఉపన్యాసములలో తెలుపడమైనది.)

ఇట్లు జ్ఞాన తీక్ష్ణతవల్లను, పొరబాటుకు ఆస్పదము లేని చక్కని ఆలోచనలవల్లను, మానవాతీత తర్క సమ్మతముగను, మహా ఋషులు అనుభవింపబడు కర్మకన్న, ననుభవము కలిగించు క్రియకన్నను, అనుభవించు కర్త సర్వశక్తిమంతుడని తెలుసుకొనగలిగిరి.

కర్మగాని, కర్త, కర్మ క్రియ సంబంధముగాని, కర్త అనబడు ప్రజ్ఞయొక్క అంశము అధిష్ఠించి యుండుట వల్లనే, అస్తిత్వము కలిగియున్నవి; వ్యవహారము జరుగుచున్నది. కనుక వారు ఈ కర్త, అతని స్వభావము, అతని నిర్మాణ స్వరూపము, అతనికార్య వ్యవహారములు, అతని ప్రపంచమును గురించి వారి విమర్శనా పరిశ్రమలను సాగించిరి.

హిందూ వేదాంతమును పఠించు పాశ్చాత్యులే గాక, హిందూదేశమునందలి అల్ప విద్యా పండితులు కూడ, హిందూ వేదాంతమును ఆక్షేపణ చేయుచుండుట తటస్థించుచున్నది. ఈ ప్రాగ్దేశవాసుల దేవతలు, పౌరోహితులు వారి దృష్టినంతయు అంతరముఖము చేసుకొని, బాహ్య ప్రపంచ వ్యవహారములనే గమనించుటలేదు అని వారి ఆక్షేపణ. వారి ఆక్షేపణ అంతయు నవీనకాల వ్యవహారమునయున్న వేదాంత ప్రచారమునకు అనుసరించునేగాని, మూల శ్రుతులలోని వేదాంత విషయములకు వారి ఆక్షేపణ పొసగదని వారు కొంచెముకూడ తెలుసుకొనలేకున్నారు.

నేడు ఆ తేజో విషయములనే యొక నెపముగా నుంచుకొని, సోమరితనమునకు అశక్తతకులోబడి, నపుంసక, నిర్వ్యాపారమ బురదలో జనసమూహము మునిగి యున్నది. ఇట్టి నిర్వ్యాపారమును, అనుమాన రీత్యాగాని, స్పష్టముగాగాని వేదాంతము ఎన్నడును బోధించి యుండలేదు. అరేబియన్ నైట్లు వ్రాసిన విచిత్ర గ్రంథకర్తకూడ వేదాంతమున ఇట్టి భావములను కనుగొని యుండజాలడు. ఈ విపరీత వ్యాఖ్యానములంతయు, తన సౌకర్యార్థము శనేశ్వరుడు శాస్త్రములను చదువునట్లున్నది. పావన వేదాంతమూలములలో తెలిపిన దివ్యజ్ఞాన భావమును చక్కని కర్మవ్యవహారమును స్పష్టముగా ప్రకటించబడి, వాటిని అనుసరించుట శ్రేయస్కరమని బోధించుచుండగా, నిష్ప్రయోజనకర మానవ సమూహము తామరపూవులుతిని బ్రతుకవలెనను సోమరితనముతో, దివ్య వేదాంత సూత్రములకు మసిపూసి, వితర్కములు చేసియున్నారు.

మనము మన విచారమును గమనించ ప్రయత్నించెదము. ఇట్లు కర్తయే సర్వోత్కృష్టత కలిగి యుండిన యెడల, జీవిత విమర్శ చక్కని శాస్త్రరీతి జరుగవలెనన్న, ఈ కర్తను చక్కగ విమర్శింపవలెను. ఇట్లు వారు విచారించుచురాగా, మన ప్రతియొక్కరియందును, ఒక వ్యక్తి మాత్రముయుండి వ్యవహరించునట్లులేక, అనేక వ్యక్తులు వ్యవహరించునట్లు తెలుసుకొనిరి. మన ప్రతియొక్కనియందును, మూడు, లేక నాలుగు వ్యక్తులు వ్యవహరించుచున్నారు. చూచుటకు ఒక శరీరము జన్మించి పెరుగుట తెలియుచున్నను, అందులో ఒక గొట్టములో మరియొక గొట్టము ఇమిడియున్నట్లు, నాలుగు ముఖ్య స్వరూపములు తెలియుచున్నవి. వాటిలో ప్రతి యొకటి తన్ను తాను ముఖ్యమని ప్రత్యేకమని ప్రకటించుకొన ప్రయత్నించుచున్నవి.

ఇట్లు ఒక మానవునియందు, స్థూలవ్యక్తి, మనోవ్యక్తి, జ్ఞానవ్యక్తి, దివ్యవ్యక్తి అని నాలుగు యున్నవి. ఇవి ప్రతి యొక్కటియును, తన ప్రపంచ వ్యవహార విలువకలిగి, తన ఆలోచనలలో మునిగి, తన కోరికలు, తన యుద్రేకములు, తన అభిప్రాయములు తన ఆదేశములతో గంద్రగోళము పొందుచున్నవి. తమ బంధముక్తిని సంపాదించి, ఏదో యొక నిర్ణయింపజాలని, స్వాతంత్ర్యమును, శాంతమును, ఆనంద ఆవరణలోనికి తప్పించుక పరుగిడవలెనని నిరంతర ప్రయత్నములు చేయుచున్నవి.

ఇన్ని అల్లకల్లోలములను, ఒకే కాలమున, ఒకే హృదయమున సంభవించుచున్నవి. ఇటువంటి మానవుని రాజకీయ, ఆర్థిక వ్యవహారములలో, నాగరిక పట్టణవాసి అని తలచుచున్నారు. ఇట్లు మనలో

ప్రతి యొక్కరును కంతెరీగల తెట్టవలె, వేలకొలది వివ ఆలోచనలుంకలిగి, ప్రతియొక్కటి మనలోని నాలుగు స్వరూపముల కోరికలను దృఢపరుచుచున్నవి. ఇన్ని రకముల కోరికలను తృప్తిపరచుటకు మనలో రెండు చేతులు, రెండు కాళ్ళు మాత్రము కలిగియుండుట కడు దుఃఖింపవలసిన విషయము.

ఆగచాట్లుపడుచు, కష్టపడి సంపాదించి, ఆర్జించి, రాశిపోసి, వంటచేసి, భుజించి, జీర్ణము చేసుకొనుట, ఇట్టి కార్యములుచేయుచు, ఈ శరీరము ఇన్ని వ్యక్తి స్వరూపములకు బానిసయై అల్లాడుచున్నది. మానసిక వ్యక్తికి, జ్ఞానవ్యక్తికి, దైవీ వ్యక్తికి, లొంగి కృషి చేయుచు మధ్య వయసు వచ్చులోపల శిధిలమగుస్థితిని పొందుచున్నది. దీని జీవిత సంవత్సరములన్నియు, తనకును, ఇతరులకుకూడ రూపుమాపు వృధాప్రయాసయగుచున్నది. ఇటువంటి దురవస్థలోనున్న మానవ శరీరమును, వ్యవహార జీవితమున స్వర్ణతుల్యకాలమని పొగడుచున్నారు.

ఒక సామాన్య గృహమును గమనించిన యెడల ఒకే ఇంటిలో నివసించుచు, ఒకే తలి దండ్రుల రక్షణకు పాత్రులయియున్న నలుగురు సోదరులు, సంవత్సరమున ఒక దినమునయైనను, ఒకే రీతి సంతోషానుభవమును పొందలేకయున్నారు. ఎట్టి పదార్థములు వంటచేసినను, అది ఎవరికో యొకరికి అసంతృప్తికరముగ నుండును. ఇట్లు నలుగురు వ్యక్తులు ఒక సమభోజనమున, సమాన సంతృప్తి పొందలేక పోయిన యెడల, నాలోనున్న నాలుగు స్వరూప వ్యక్తులు, ఈ బాహ్య గంద్రగోళ వ్యవహారములలో సమాన సంపూర్ణ సంతృప్తి గాంచగలవా !

ఇట్లుండియు, ప్రపంచమునగల ఆతురతవలన మానవుని ఆంతర నిర్మాణ స్వరూపమును కనుగొనకయే, మానవుని సుఖప్రాప్తికొరకు, అడావుడితో, భయకంపముతో, క్రోధావేశముతో, చంపుచు, దోపిడి చేయుచు, ఒక శాసనము వెనుక మరియొక శాసనము తయారుచేయ ప్రయత్నించుచున్నారు. పాపము వారి ప్రతి ప్రయత్నమునందును, మరల మరల కార్యభంగమునే పొందుచున్నారు.

ఈ విషయ పూరిత ప్రపంచమున మానవవ్యక్తిత్వ నిరూపణ సిద్ధాంత శాసనములు, అవమానముతో నిలబడి, మిక్కిలి దుఃఖించుచు, దిక్కులేనిదై జీవిత పురమునగల చిన్న సందులలో నిలబడియున్నది. నిస్సహాయముతో, అవమానముతో, దోపుడుపోయి, మానభంగముగాంచి యున్నది. బాహ్య వ్యవహారములను, సంఖ్యలను లెక్కపెట్టు గ్రుడ్డి భక్తులే ఇట్టి జీవితమును ప్రకృతి విషయ సముదాయముల సహాయమున పునరుద్ధారణము చేయగలమని ఆశించుచున్నారు. కొద్ది జ్ఞానమును, దృష్టిని ఊర్ధ్వముగా ప్రచరింప శక్తిగల మానవులు, ప్రపంచ విషయ సముదాయమువల్ల ప్రపంచ ఉద్ధారణము చేయగల ప్రయత్నము పూర్తిగ భంగము గాంచియున్నదని స్వయముగనే తెలుసుకొనుచున్నారు. కాబట్టి ఇసుకలో పూడిపోయిన మానవుని పడవను ప్రపంచ జీవితమను నడియేటిలో తేలునట్లు చేయవలెనన్న ఇట్టి కార్యము ఒక సత్య మతమునకే సాధ్యము.

మిత్రులారా ! మీయొక్క ఆతుర ముఖ చిహ్నములు, జీవిత సమస్యలవల్ల తెల్లబారి వణుకుచుండు ముఖలక్షణములుచూచి, నేను ఇట్టి ఉపరి ప్రసంగము చేయ లాగబడుచున్నాను. కార్య ప్రసంగమునకు దూరముపోయినవాడనైతిని. క్షమాపణలు తెలుపుకొనుచున్నాను.

మనము జీవితమునందు శాంతము, ఆనందము వెదుకుచున్నామను భావము అందరు తప్పక ఒప్పుకొనుచున్నారు. ఈ వెదుకుటకుగల విధానము, వెదుకుచుండు ఆవరణము ఒక్కొక్క మనుష్యునికిని, ఒక్కొక్క స్థళమున, ఒక్కొక్క కాలమున వ్యత్యాసములు కలిగియున్నవి. కాని ప్రతియొక్కరు ప్రతియొక్క స్థళమున, ప్రతియొక్క కాలమున కోరునది ఒకటే. ఆనందము, శాంతి బాహ్య విషయములలో నిర్ణీత కాలములో నిర్ణీత స్థళములో మన కోరికాను సారము అనుభవించగలిగిన ఆనందము శాంతము పొందుచున్నాము అని తలచెదము.

మన బాల్యమున మనము ఏది చాల ఆనందము సుఖము గలిగించగలిగెనని తలచియుంటిమో అది మన

యౌవనమున ఆనందమును సుఖమును కలిగింపజాలకున్నవి. ఒక రంగుల గోలిగుండు దొరకిన, లేక ఒక రబ్బరుబంతి దొరకిన బాల్యమున పరమానందము పొందగలుగుచుంటిమి. ఈ వస్తువులనే మన షష్టాబ్దిపూర్తి మహోత్సవమున మనకు బహూకరింపబడిన మనము ఎట్టి ఆనందమును పొందజాలము. బహుశ వాటినిచూచి మనము కష్టమునుకూడ అనుభవింప ఆస్పదమున్నది. ఏలన వాటినిచూచి మన బాల్యము గడచినపోయినదేగాక, వృద్ధాప్యముకూడ సంభవించినది. ఇక అంత్యదినము ఎప్పుడు వచ్చునోగదాయని భయము కలుగును. ఇట్టి ఉదాహరణములు పెంచి సుఖము, శాంతము అను శబ్దముల భావము నిర్ణయించ సాధ్యముగానున్నది.

ఇందుగల కష్టము లేక మానవుని కార్య భంగములకు ముఖ్య కారణము ఏమన ఈ స్థూల శరీర కోరికలు మనోవ్యక్తిత్వ కోరికలకు వ్యతిరిక్తముగా నున్నవి. ఇక జ్ఞాన వ్యక్తిత్వ కోరిక మరొక రీతిని యున్నవి. ఇక దైవ వ్యక్తిత్వ కోరికలు మఱియు వేరు మార్గమున యున్నవి. ఇట్లు ఒక మానవుడు నాలుగు వేరు వేరు రకముల కోరికలచే, ఏక కాలమున ఏకస్థళమున పీడింపబడుచున్నాడు. ఇందు రెండు రకముల కోరికలుగాని, ఒకే స్థళమున ఒకే కాలమున అనుభవింప సాధ్యములేదు. ఏలన అనుభవములకు కాలము, దేశము ఆవశ్యకములు. కాబట్టి మనము ఎట్టి ప్రయత్నములు చేసియైనను, చక్కని విషయముల అమరిక నియమించి, చక్కని సంతృప్తినిపొంది ఈ నాలుగు రకముల వ్యక్తిత్వములను సంతోషపరుప తలచిన మనము తప్పక కార్య భంగములను పొందగలము. కాని మనము మనలోని ఈ నాలుగు వ్యక్తిత్వములను అభ్యాసముచేత క్రమశిక్షణవల్ల వీటికిగల ఉద్రేకమును ఉన్మాదములను తొలగించి ఏకరూపము గావించగలిగిన యెడల అటు పిమ్మట మనము మఱింత స్వాతంత్రమును, సుఖమును ఈ బాహ్య ప్రపంచమున అనుభవింపగలము. దీనికి కావలసిన శిక్షణా విధానమునే మనఋషులు మతము అని తెలిపి యున్నారు.

ఈ విధానము ఏమి, దీనిని నిరవేర్చుట ఎట్లు అని విచారించగలుగుటే హిందువుల పావనగ్రంథములైన ఉపనిషదుల బోధ. ఈ మానవుని నిర్మాణము ఎట్లు కలిగియున్నది. మానవుని స్వభావములు ఏమి, అతడు తన్ను ఎట్లు తెలుసుకొనవలెను? ఈ బాహ్య ప్రపంచమును ఎట్లు తెలుసుకొనవలెను? అనగా అతడు చక్కని వ్యవహారమువల్ల చక్కని కర్త ఎట్లు కాగలడు? చక్కని అనుభవమును ఎట్లు పొందును? సత్య విషయములను ఎట్లు అనుభవించగలడు? ఈ రహస్యములు తెలుపుటే ఉపనిషదుల ముఖ్య యుద్దేశము.

మనము చక్కని పరిశుద్ధ విమర్శనా దృష్టితో జ్ఞానసాధనముచేత ఈ విచారము జరుపగలిగిన యెడల ఇందు ఎంతటి రుచిని అనుభవించగలమో, ఎంతటి ఫలదాయకముగ నుండునో, మనకేగాక ప్రపంచమునకుకూడ దీనివల్ల ఎంతటి ఉపయోగముండగలదో ప్రకటితముకాగలదని నమ్ముచున్నాను. మీరు ఈ యజ్ఞశాలకు శ్రుతులయందు మీకుగల శ్రద్ధా భక్తులు వెంటబెట్టుకొనివచ్చి వీటికిలేని రూపములు కల్పింప నక్కరలేదు. వాటిని దూరముగనుంచి వేయుడు. ఇచ్చట చక్కని విమర్శనా బుద్ధితోరండు. వినుటకు ఓర్పును వినవలెనను కుతూహలమును కలిగి రండు.

ఓం తత్సత్



# ఉగాది స్వాగతము

శ్రీమతి ఎమ్. వి. తాయారమ్మ

జయ వత్సరమునందు। జరిగిన వైపరీ-త్యాదు లెవ్వియు ప్రజలందకుండ।
ఆంధ్ర రాజ్యరమా శుభాస్థానమండలి। - సుస్థిరంబగునట్టి శోభజెంద।
జను లెల్లరును శాంతి సౌఖ్య సంపన్నులై। - యైకమత్యముతోడ నలరునట్లు।
కరవు కాటకములే వెరపును లేకను। - సిరిసంపదలతోడ జెలగునట్లు।
తెలుగు సంవత్సరాదిని తేజమలర। - వరములీయుమ! మన్మధవత్సరంబ!
కాలపురుష స్వరూప! యుగాదిదేవ। - స్వాగతంబిదె గొనుమ! సుస్వాగతంబు

---

# ఉగాది

శ్రీ కే. నరసింహాచార్యులు

ఉగాది పండుగ వచ్చింది.
జగాన మెరపై మెరసింది.
తెలుగుల వెలుగును చిమ్మింది
పలుగుల దర్పము నణచింది.

ఉగాది పండుగ వచ్చింది
ప్రచండ చండిమ నిచ్చింది.
ఉజ్వల చరితను తడవింది
మహోజ్వల గాధలు మీవంది.

ఉగాది పండుగ వచ్చింది
చక్కని చుక్కై మెరసింది.

కవి కోయిలలై పాడింది
విరి తేనియలై విరిసింది
మధుపరవమ్మై మొరసింది
సురభిత పరిమళ మెగసింది.

ఉగాది పండుగ వచ్చింది
జగాన నాట్యము సల్పింది.
కక్షలు మీకికవద్దంది
శుభాకాంక్షలివె కొమ్మంది.

ఉగాది పండుగ వచ్చింది
జగాన మెరపై మెరసింది.

---

# ఉగాది శుభ కాంక్ష

కుమారి సుందరి

వచ్చెను మన్మథాఖ్య శుభవత్సర మాంధ్ర జనాళికిన్ ముదిన్
హెచ్చుఁగ సంతసమ్ము, జగదీశతనూజుఁడు మన్మథుండు దాఁ
బచ్చని విల్లు చేతఁగొని పాలనసేయఁగ నాంధ్రధరణిన్,
సచ్చరితంబుతో. బ్రజలం సర్వసుఖంబుల బొందివర్ధిలన్.

తలపడివచ్చు కష్టములఁ దాల్మిసహించుచు నిండుప్రాణముల్
బలియొసఁగన్ లభించిన యపారయశోనిధి నాంధ్రరాష్ట్రముల్
గలియుగ ధర్మరక్షకుఁడు కంజదళాక్షుఁడు స్వామి వేంక
చలపతి నూత్నవర్షమున సంతతమేలును గాతసత్కృపన్.

శ్రీలు సెలంగ తావగుచు చెన్నువహించెడి విద్య దానికిన్
జాలిన శీలసంపదయు సద్వినయాతిశయంబునిచ్చి యే
వేళల నాంధ్రలోకమును ప్రేముడిఁ బ్రోచుత, నింద్రకీలశై
లాలయ దేవి దుర్గ జగదంబిక సత్కరుణారసాబ్ధియై.



మన దేశంలో ఆటవస్తువుల తయారీ ఒక ప్రధాన కుటీర పరిశ్రమ. ఈ చిత్రంలో టెన్నిస్ రాకెట్లు తయారగుచుండుటను చూడనగును

# నవ్య కవిత్వ పరిణామము

శ్రీ దాసరి వేంకట కృష్ణయ్య



"దేశభాషలందు తెలుగులెస్స." తెలుగుభాష తియ్యదనము పాశ్చాత్యులచేతగూడ "ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్" అని పొగడబడినది. అంటే ప్రాచ్య దేశపు ఇటలీభాష వంటిదని పొగిడియున్నారు. ఉత్తమమగు భావన, సరళమయిన భాష - ఈ రెంటి కలయికవలననే కవిత్వము పుట్టుచున్నది. ఆధునిక కవిత్వముయొక్క రూపు రేఖలను వివరించటమే ఈ వ్యాసముయొక్క ప్రధానోద్దేశ్యము.

తెలుగు భాషా సాహిత్యములో ఆధునిక యుగము క్రీ. శ. 1875 సంవత్సరమునుండి ప్రారంభమైనది. ఈ యుగములోనూ, యింతకు ముందూ దేశములో రాజనీతికము, సామాజికము, ధార్మికము యింకా సాహిత్యంలో విప్లవము - వీటన్నిటియొక్క ప్రభావము ప్రత్యక్షంగా, పరోక్షంగా తెలుగు సాహిత్యముమీద విరచుకుపడింది. ఈ ప్రభావమువల్లే తెలుగు కవిత్వములో గొప్ప పరివర్తనము కల్గినది. భాషలోనేమి, భావములోనేమి, వ్యంజనములోనేమి అన్నింటిలోనూ కొంగ్రొత్తదారులు పొడకట్టినవి. ఆధునిక కవిత్వమునుగూర్చి తెలుసుకొనబోయేముందు ప్రాచీన కవిత్వముయొక్క విశిష్టతనుగూర్చి కొద్దిగా పరిచయము చేయటము అప్రస్తుతము కాదనుకొంటాను.

ప్రాచీన తెలుగు కవిత్వము ప్రబంధ రచన ప్రధానమైనది. కొన్ని సంవత్సరాలు సాధనచేసిన తదుపరి కవిగణము ఉద్గ్రంథ నిర్మాణములో సఫలురైరి. కవిత్వము రాజాశ్రితము. సంస్కృత సమాసములతో నిండి, భాష నుపయోగించు శక్తి సామర్థ్యములు గల వారు గౌరవింపబడుచుండిరి. కావ్యములో నుపయోగించు భాషకూ, జనసామాన్యము వాడుభాషకూ ఎక్కడా పొత్తులేదు. అందువల్ల కావ్యము సామాన్యునికి అవగాహనకాలేదు. కావ్యములో భావము తక్కువగను, కళనుగూర్చి అధికముగను నుండెడిది. కవులయొక్క మనస్సు కేవలము పాండిత్య ప్రదర్శనము మాత్రమేయైయున్నది.

ఈ విధమైన సాహిత్యస్థితి శ్రీకృష్ణదేవరాయల కాలములో సంస్కరించబడినది. ఇంతకు ముందున్న కవులలో క్రొత్త పోకడలులేవు. క్రొత్త కవులు వారికి పూర్వమందున్న కవులను అనుకరిస్తూ వచ్చారు. రచనా చమత్కారము, అలంకారము, ఛందోబద్ధంగా పూర్వకవుల పంథానే త్రొక్కసాగిరి.

ఆధునిక యుగము ప్రారంభదశలో ఆంగ్లేయుల ప్రభావము హిందుస్తానములో రాజొచ్చినది. క్రీస్తు ధర్మముగూడ వచ్చినది. క్రైస్తవ మతప్రచారము వలన హిందువులలో అధిక సంఖ్యాకులు అటు మొగ్గు చూపేసరికి హిందూమత పక్షపాతులయిన రాజా రామమోహనరాయ్ వంటివారు దానికి ప్రతికూలముగా నుండజొచ్చిరి. వారు బ్రహ్మసమాజమను పేర ఒక సంస్థను స్థాపించి, దానిద్వారా నిస్పంద హిందూ ధర్మాన్ని నాశముచేయ సమకట్టిరి. వారు బ్రహ్మ సమాజముద్వారా వ్యక్తి స్వాతంత్ర్య పక్షమును పెద్దదిచేశారు. మానవులు స్వతంత్రులు, వారు అశక్తులుకారు. మీదు మిక్కిలి 'శక్తులకు నిధి' వంటివారు. వ్యక్తి సమాజమునుంచి ముందుకు సాగిపోతాడు. జాతులన్నీ కల్పితములు. సృష్టి అంతటికీ ఒకటే ధర్మము - అదే మానవ ధర్మము. ఇటువంటి విప్లవ రేఖలన్నీ బ్రహ్మ సమాజమునుండి వుద్భవించినవి. ఈ విధమైన వ్యక్తి స్వాతంత్ర్యము ననుసరించి, స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీలకు హక్కులు

(891 పేజి చూడుడు)

ఆంధ్ర జానపదగేయ వాఙ్మయం

# గాంధారికథ (విమర్శ)

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

పెండ్లిచేసుకోడానికి మేనమామ వచ్చాడు. కాని ఆమె మంత్రశక్తివల్ల అతనితో అతని సైన్యంతో యుద్ధంచేసి వారిని నాశనంచేసింది. కాని మేనబావ ప్రార్థనమీద వారందరిని మళ్లీ బతికించింది. వైభవంగా ఆమెకి మేనబావతోనే వివాహమయింది.

పాత్రలకి నిజనామాలు పెట్టడానికి వెరచి కవి గూఢంగా తెలియజేశాడు. కాని ఎంత నిగూఢమైనా వాటిలో సబబు ఉంటుంది. రుద్రమ్మకి గాంధారి అని పేరు ఎందుకు పెట్టేడో? కాకతీయులు ఉత్తర హిందూదేశంనుంచి దక్షిణానికివచ్చి రాజ్యం స్థాపించేరని చరిత్ర. ఉత్తర హిందూదేశంలో గాంధార దేశంలో వీరు ఉండేవారా? మరి గాంధారి నామానికి కారణమేమిటి?

జంగం కథలో చెప్పిన మెలకలు కొన్ని రుద్రాంబ వివాహంలో ఉండి ఉండాలి. కాని మనకు అప్పటి తబిసీళ్లు తెలుస్తేనేకాని ఈ అంశాలు బైటపడవు.

వ్యంగ్య రచనకి కారణమేమిటి? జంగం కథలు కొన్ని వ్యంగ్య రచనలుగా ఉన్నాయి. పాత్రలకు, స్థలాలకు అసలు పేర్లుండక మారుపేర్లుంటాయి. ఇట్టి నిగూఢతకి తగినంత కారణముండాలి. కథ జరిగిన కాలంలోగాని దగ్గిర కాలంలోకాని ఆ సంగతులను యధాతథంగా పేర్కొనడానికి కొన్ని సందర్భాలలో వీలుండదు. అది కొంతవరకు వ్యక్తులను గురించే చేసేవిమర్శ, చిత్రణనుబట్టికూడ ఉంటుంది. యథార్థ పాత్రలకి అట్టి చిత్రణ ఇష్టంకాకపోవచ్చు. పొరుగుదేశంవారిని గురించి యథాతథంగా చిత్రించడంలో బాధ ఉండదు. కాని తమ రాజును గురించి అట్లు చిత్రించడం బహు కష్టమైనపని. కుమారరాముడు పొరుగుదేశపురాజు కాబట్టి ఈకవి అతన్ని, అతన్ని గురించి బహిరంగంగానె చిత్రించేడు. కాని తన దేశపు రాణియైన రుద్రాంబను గురించి ఆ విధంగ ధైర్యంగ చిత్రించలేకపోయేడు. అంతేకాదు; ఈ రెండుకూడ కథ రచనలో రెండు శిల్పములుగా గణించవచ్చు. అది కవియొక్క ఇష్టాన్నిబట్టి పోతుంటుంది. ఈ కవికి కుమారరామునికథలో బహిరంగత, గాంధారి కథలో నిగూఢత ఇష్టమయేయి.

## ర చ నా కా లం

జంగంకథ జరిగిన కాలానికి అది రచించిన కాలానికి అంతరం చెప్పదగినంత ఉండదు.

రుద్రాంబ క్రీ. శ. 1260 నుండి1295 వరకు పాలించింది. రాజ్యానికి రాక పూర్వమే ఆమెకు వివాహమయింది. ఈ జంగంకథను కవి రుద్రాంబ పరిపాలన అయిపోయిన పిమ్మట రచించినప్పటికి దీని రచన 1300 దాటదు. అంత దగ్గర కాలంలో రచించబట్టే కాబోలు దీనిలోని పేర్లలో గూఢత ఏర్పరిచేడు.

పైకాల నిర్ణయాన్ని బలపరిచే కొన్ని అంశాలు ఈ జంగం కథలోనె కనబడతాయి. ఈ కథలో పక్షులు రెండు, సుమతీశతక పద్యాలను ('అపకారికి' 'పెట్టని దినముల' అను ప్రారంభంగలవి పుట 59) వర్ణించేయి. ఈ జంగం కథకి పూర్వమే సుమతీ శతకం రచించబడ్డదన్న విషయం రుజువవుతూంది. సుమతీశతక కర్త బద్దెరాజు. ఇతను క్రీ. శ. 1261 ప్రాంతంవాడు. "ఈ ... కాలమునందు కాకతీయ రాజ్యము రుద్రమదేవి పాలించుచుండెను. ఆమె క్రింద సామంతుడుగానుండి బద్దెన కృష్ణాతీరమందొక చిన్న రాజ్యమును బాలించుచుండినట్లు కనబడుచున్నది" అని జయంతిరామయ్యా పంతులుగారు వ్రాసేరు ♦ 1261 ప్రాంతంవాడైన బద్దెరాజు రచించిన పద్యాలు 1300 ప్రాంతపు రచనలో ఉదహరింపబడడంలో బేసబబేమీలేదు. అప్పటికే సుమతీ శతకం విశేషజనత (Popularity) గాంచింది.

'గుండ్రాతికి కాళ్లువచ్చి గునగున నడిచెన్' అను సమస్య ఒకటి ఈ జంగంకథలో కనబడుతూంది. ఈ

♦ ఆంధ్రకవుల చరిత్రపుటలు 243, 244.

సమస్య 1300 ప్రాంతానికే ఉన్నదన్నమాట. ఈ సమస్యా పూరణపద్యం కొన్ని చాటు గ్రంథాలలో కనబడుతూంది.

కుమారరాముని కథా రచనా కాలానికి, గాంధారి కథా రచనా కాలానికి సబబైన అంతరముందో లేదో చూద్దాం. (గాంధారి) రుద్రమ్మ కాలం (క్రీ. శ. 1260-1295) లోది. కుమారరాము రెండో ప్రతాపరుద్రుడికి (1295-1321) సమకాలికుడు. కాబట్టి ఈ కవి రుద్రమ్మ కాలాంతమందొకటి, ఆమె తర్వాత రాజ్యానికివచ్చిన ప్రతాపరుద్రుడి కాలంలో ఒకటి రాసేడంటే అందులో అసందర్భమేమీ లేదు. కుమారరాముడు 1327 ప్రాంతంలో జీవితయాత్ర చాలించేడు. ఆ జంగంకథలో కుమారరాముని మరణముంది కాబట్టి అది 1327 తర్వాత రచించినదే అని స్థిరమవుతూంది. రచన 1330 ప్రాంతం కావచ్చు.

ఒకే కవి ఈ రెండు కథలూ రచించేడన్నది నిశ్చయం. వాటి రచనా కాలాలు ఇంచుమించుగా చెప్పడమే సాధ్యమవుతుంది. వెంట వెంటనే ఈ రెండు గ్రంథాలు రచించేడనుకోడంకంటె 1300 ప్రాంతంలో కుమారరాముని కథను రచించేడని చెప్పుకోడం సమంజసంగా కనబడుతూంది. కుమారరాముడికంటె ప్రతాపరుద్రుడే ముందు మరణించేడు-అథవా మహమ్మదీయులకు బందీగా చిక్కేడు. జనులకు కుమారరాముడు జీవితం ఆశ్చర్యంగా కనబడ్డదికాని ప్రతాపరుద్రుడి జీవితంలో అద్భుతాలు కనపడలేదు. కుమారరాముడి కథా రచనకి కారణమదే !

కంపిలి రాజ్యం, ఓరుగంటి రాజ్యం పక్క పక్కలనే ఉన్నాయి. కంపిలి రాజ్యాన్ని అంటిపెట్టుకొన్న ఓరుగంటి రాజ్య భాగంలోనె కవి నివసించేవాడేమో ! అందుకనే కుమారరాముడిమీద అంత మెప్పు కుదిరిందేమో !

## ఆ కాలపు లక్షణం

ఆ కాలపు ముఖ్య లక్షణ మొకటి దానిని ఇక్కడ వివరిస్తాను. గాంధారి మంత్రశక్తిని గురువుగారి పుస్తకంచూచి నేర్చుకొంది. దీని ప్రాముఖ్యత ఏమిటంటే - ఆ కాలంలో జైనమతం కొన్ని తావులలో ఉండేది. బ్రాహ్మణమతం జైన మతాన్ని నిర్మూలించడానికి తలపెట్టింది. బ్రాహ్మణులు రాజుల ప్రాపకాన్ని సంపాదించేరు. మంత్ర తంత్రాలు ప్రయోగించి జైనులను నాశనం చేసేరట ! (-కాకతీయాంధ్ర రాజయుగచరిత్ర, పుట 552). గాంధారి కథలోని గారడీ దానిని బలపరుస్తూంది.

## ఈ కథ సుఖాంతమా ?

జంగంకథ లన్నిటిలోలాగె ఈ కథలోకూడ చివరివరకు కష్టాలువున్నాయి. మనుష్యులు మరణించేరు. గాంధారి మంత్ర మహిమవల్ల మళ్ళీ వాళ్ళు బతికేరు. అంతా సుఖంగా ఉన్నారు. కాబట్టి ఇది సుఖాంతమే ! ఇది జంగంకథా సాంప్రదాయమే !

## జంగంకథా సాంప్రదాయాలు

జంగంకథలో అతిలోక పురుషులుండడమొక సంప్రదాయం. దానిని కవి చమత్కారంగా ఈ కథలో ఇమిడ్చేడు. గాంధారి మంత్రవాదిని కాబట్టి అనేక అతిలోక కార్యాలును అసహజమని మనకు అనిపించకుండా చేయగలిగింది. ఆమె తల్లి తపస్సు చేసిన పిమ్మటే ఆమె జన్మించింది. జంగం కథకి దేవతా గుర్రమొకటి అవసరం. బాలరాజు ఒక గుర్రాన్ని కావాలనగానే గాంధారి సృష్టించింది. సుహితుడికి సలహాదారుడు నాగంభట్టు దొరికేడు.

దీనిలో సంఖ్యల సంప్రదాయం పుష్కలంగా కనబడుతూంది. ఏడు సంఖ్య అనేకచోట్ల వాడబడింది. ఏడుకోట్ల (కోటల?) భూమండలాన్ని రాజు పాలిస్తున్నాడు (పుట-2) ఏడు నిలువుల పొడుగునూదిగుండు ఉంది (4). ఏడునూదులను దొంతిగా నిల్పింది, ఏడు కుంబిని కోటలు (8), ఇంటి ఆడపడుచు దుఃఖపడితే ఏడుదంతెములమీది కోకలు కాలిపోతాయి (26), బొమ్మను చేయడానికి ఏడుజోలెల మొహిరీలను

ఇచ్చేరు (49) ఏడుఘడియలలో అశ్వాలు వచ్చేయి (72) ఏడుదర్వాజాలు (60) ఇత్యాదులు.

పన్నెండు సంఖ్యను గురించి-రాణికి పన్నెండేళ్ళనుంచి సంతానంలేదు. పన్నెండేళ్ళనుంచి సుహితరాజు పెండ్లాడలేదు. ఊరు పన్నెండామడల దూరముంది (45, 73).

ఈ కథలో పదమూడంకె ఒకటి వస్తూంటుంది. పదముగ్గురు జెట్టీలు తరుచు వస్తారు, పదముగ్గురు బ్రాహ్మలు (48) ఇత్యాదులు ఇతర అంకెలు కొన్ని-ఏభై రెండు ఉత్తరాలను చెప్తాడు బాలరాజు. అయిదువందల ముత్తయిదులు (48) 24000 సైన్యం-ఉన్నాయి.

ఈ కిందివి దుశ్శకునాలుగా గణించబడ్డాయి. ఓడమీదవకపక్షి (?) నంబి-వరదుకూత (54), గరగబుడ్డి పగులుట (56) అందలం విరుగుట, కలశం విరుగుట (56) ఇత్యాదులు.

## కథా ప్రాశస్త్యం, హాస్యరసం

జంగంకథలు ఉపజ్ఞా (Originality) నిధులు. ఈ కథకూడ అట్టిదే. దీనిలో కల్పన అసాధ్యంగా ఉంది. ఇది రాజకుటుంబంలోని సాంసారిక కథ. కవి చక్కని పాత్రలు మూడింటిని ఆంధ్రవాఙ్మయానికి అందించేడు. మంత్రవాదినియైనరాణి, మూర్ఖుడైన రాజు సుహితుడు, పిరికివాడైన బాలరాజు. ఈ పాత్రలు వాటికవేసాటి! మూర్ఖుడైన సుహితుడి చేష్టలలో మూర్ఖత్వం నిండిఉంటుంది. బాలరాజు పాత్ర పిరికితనాన్ని ఆధారంగా చేసుకొని కవి హాస్యరసాన్ని ప్రవేశపెట్టేడు. అతని చేష్టలు, మాటలు నవ్వు పుట్టిస్తాయి. కవి అంగవైకల్యాన్ని నవ్వులాటగా చేసేడు! జగజంత్రీయైన గాంధారి ముందు, మిగత పాత్రలు ఏనుగుదగ్గిర పిచ్చికలాగుంటాయి. ఇటువంటి చిత్రమైన పాత్రలను సృష్టించిన కవికి మనమెంతో కృతజ్ఞత చూపించాలి. కాకతి రాజ్యాన్ని ఏలిన రుద్రాంబ రాణినే గాంధారి పాత్రలో ఇముడ్చుకొంది. దీనిలోని కోమటిపాత్ర పోలిసెట్టి.

## ఇతర అంశాలు

'కుంభినికోట' - అను మాటనుచూస్తే కుంపిని (Company) తో సంబంధపరచాలనిపిలుస్తుంది.

కాని ఆ మాట వేరు. కోటలలో నాలుగు రకాలున్నాయి. శివయోగసారం అను వేదాంత గ్రంథం యొక్క అవతారికలో-

స్థల, గిరి, వనదుర్గ, జలకోట మల్లుడై
గ్రక్కున బెక్కుదుర్గములు గొనియె

అని కవి చెప్పేడు. పట్టినేలమీద గోడలు లేవదీసి, అగడ్తలు త్రవ్వి, తయారుచేసినకోట కుంభినికోట లేక నేలకోట అవుతుందని చెప్పవచ్చు. నేలకోట అనుమాట కుంభినీ కోటకి తర్జుమాపదమే! రాజ్యంలో ఏడు కుంభినికోటలుండడం చాల ఘనత-అట్లే 'డెబ్భై రెండు కరపట్టణాలు (రేవుపట్టణాలు) ఏనూటయెనభై రాజవీథులు, యేనూటయెనభై సంధులు (8)' ఉంటే గొప్ప రాజ్యమన్నమాట! ఏక శిలానగరంలో కోటను గురించిన వివరాలు ఏకశిలానగరము చుట్టును గంపకోటను కట్టించెను. దీనికి లోతట్టున మట్టికోటను గట్టించెను. దీని చుట్టును గొప్ప యగడ్తను ద్రవ్వించెను. భూమికోటకు * గవనులు గ, దిడ్లు 18, పుట్టకోటకు గవనులు 4, దిడ్లు 7, రాతికోటకు గవనులు 4, దిడ్లు 8 ... రాతికోటకు లోతట్టునున్న ఇటుకకోట ... (కాకతీయాంధ్ర రాజయుగచరిత్ర, పుట 496) పైదానిలో కొంతభాగమైనా కుంభినికోట వర్ణన అని చెప్పవచ్చు. కోటలో ఆయా భాగాలకు తూర్పు కుంభిని పడమటి కుంభిని (4) ఇత్యాదులుగా ఉన్నాయి.

ఈ జంగంకథలో ఉర్దూపదాలున్నాయి; కుమారరాముని కథలోను ఇట్లే. తెలుగు జాతీయాలు, లోకోక్తులు ఉన్నాయి. కామాటీలు (= ఉప్పరలు) (74) అనేమాట దీనిలోఉంది.

దీనిలో రెండు ఇంగ్లీషుమాటలున్నాయి ! డ్రెస్స

* ఇది కుంభినికోటకు మారుపదం మాత్రమే !

(53) ఫిడేలు (53) అనేవి ఇవి పాటగాళ్ళు చేర్చిన పదాలని వేరే చెప్పనవసరంలేదు. తుపాకీ అనునది కూడ అట్లే చేర్చబడినది.

పెదరంతు, చినరంతు అనేవి జట్టీలపేర్లు. ఈ పేర్లు కాటమరాజు కథలో గోసంగులకే ఇలాగు న్నాయి.

చినగబ్బి, పెదగబ్బి చిన్నయ్య తమ్ములు
పినరంతు, పెదరంతు బీరన్నతమ్ములు

[ఆంధ్రపత్రిక విజయసంవత్సరాది సంచిక, పుట 55.]

దీనిలో పల్నాటి వీరచరిత్రలో కనబడే చిన్న భాగము వంటిదే ఉంది. అది ఇది—

పుట యెక్కినవాణ్ణి
పూరిగరిచినవాణ్ణి
శవాలకింద దాగినవాణ్ణి
రణములో తలవిరగ
పోసుకొని పరుగెత్తినవాణ్ణి.

ఈ కథలోనిగేయం వచనంకూడ అతిసులభంగా ఉన్నాయి, మంచిధార! గేయం లక్షణం దరువు అని కవే తెలియజేసేడు. మచ్చుకి

"మీరు యేమిదెచ్చేరు?"
"వీరా అప్పగారు ఈ వేళ
పటము చాల పంపించె"
"యెందుకు పంపించింది?
మా సిబ్బంది ఖర్చుకి యేమి
తక్కువని పంపించె!"
ఘల్లున నవ్వేను రాజు
"దింపండి! దింపండి!"
దిగ్గున లేచెను!
రాజు పల్లకి కాడికివచ్చి
మైనపు జిడ్డుర ఓరీ!
బురఖా దీసెను రాజు
పటము చాల చూచెను
విభ్రాంతి గొన్నారు ॥తం॥

ఈ జంగంకథలోని ప్రేమ పదాలు చక్కగా ఉన్నాయి. మంగళహారతులు, శోభనం పాటలు, ద్విపదలున్నాయి. దీనిలో ప్రతి మా (Sculpture) నిర్మాణాన్ని కవి వర్ణించేడు (49-51).

ఈ పుస్తకంలోని అచ్చు తప్పులకు మితిలేదు. కుమారరామునికథకి వేసినట్లు దీనికికూడ మంచి ముద్రణ అవసరం.

# వెంకటేశం మేష్టరుగిరి

'స్వాతి శ్రీ'

వెంకటేశం మేష్టరు అయినాడు! అందులోనూ హైస్కూలు మేష్టరు! ఆయన మేష్టరు అయినాడంటే నమ్మలేకపోయినాం. నిజంగా అలాజరుగుతుందని ఎవ్వరూ అనుకోలేదు. నామటుకు నేను కల్లోకూడ అనుకోలేదు. అసలు ఆయనలో మేష్టరు అనే లక్షణాలు ఏమిలేవు. ఆయనకు మామూలు మనుష్యులవలెకాక ఒక హస్తం ఎక్కువవుంది. అదే చాదస్తం! ఆ చాదస్తంలోనూ అన్ని దినుసులూ సమానంగా పడ్డాయి. ఆయన గట్టిగా ఎవ్వరితోనూ మాట్లాడలేదు. ఆయనను మా ఊళ్ళో ఎరుగనివారు వుండరు. బాగా సనాతన ఆచారం గలవాడు. ఆయన పౌరోహిత్యం చేస్తూ కాలం వెళ్ళపుచ్చుతూ వుంటాడు. ఎక్కడ ఏ సుభకార్యమైనా అక్కడ తారసిల్లుతూ వుంటాడు. ఆయన చాలా పెళ్ళిళ్ళు చేయించాడు. ఆయనకయినా ఎన్నోఏళ్ళు ఉండవు! మహా వుంటే ముప్పయి ఏళ్ళు వుంటాయేమో! అంతకంటే వుండవు. పిల్లాజెల్లాకలవాడు.

నాలుగు ముక్కలు చదువుకున్నవాడు! ఆయన ఏ విషయమ్మైనా తీక్ష్ణంగా ఆలోచిస్తాడు. తిండిలోకూడ అంతే! ఏ ఒక్క ఆధరువుకి అన్యాయంకలుగకుండా చూస్తాడు. ఇక భోజనాలకి వస్తే ఛీఫ్ జస్టిస్‌లాగా ప్రతికేసూ "హియిరింగు"కు పెడ్తాడు. కేసు బాగుంటే మళ్ళీహియిరింగుకు పిలుస్తాడు. అలాగని చెప్పి మిగతా కేసులకు అన్యాయించేయడు. ఆ భోజనం కాసేపు బెంచిక్లార్కుకు చేతినిండాపని. ఇహ పెళ్ళిళ్ళ విషయములో చెప్ప నే అక్కరలేదు! ప్రతి చిన్న క్రతువూ సక్రమంగా జరిపించుతాడు. కాస్త జాగు అవుతుందేమోకానీ, దేనినీ ఆయన వదలిపెట్టడు. అందాకా ఎందుకు? మొత్తం మీద ఆయన చూడటానికి కాలానికి కాస్త వెనుక పడినవాడిలా కనుపిస్తాడు.

ఇంతకీ ఆయన మేష్టరు అయినాడు! అదే అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఆయన ఎలా మేష్టరు అయినాడనేది అందరికీ అనుమానం. నాకూ కలిగింది ఈ అనుమానం. ఒకసారి ఆయన నాకుకనపడితే, ఈ విషయమే అడిగాను. ఆయన చెప్పింది వింటే నాకు నిజంగానవ్వొచ్చింది. ఆయన ఒకసారి బంధువుల ఇంట్లో పెళ్ళి అయితే వెళ్ళాడట! అక్కడి పెళ్ళికి వచ్చిన వారిలో పరంధామయ్యగారని చీరాల హైస్కూలు హెడ్మాష్టరు వెంకటేశంకి కనపడ్డాడట. ఆయన వెంకటేశంకి బంధువేనట! ఏదో మాటల్లో వెంకటేశంని "తెలుగులో పరీక్షలేమైనా ప్యాసయినావా" అని అడిగాడట. ఏదో "ఎంట్రెన్సు" పరీక్ష ప్యాసయినానని సమాధానం చెప్పా

డట. ఇంకేముంది! ఆయన "చాలు ఆ మాత్రం పరీక్ష ప్యాసయివుంటే జూనియర్ తెలుగు పండిట్‌గా పనికివస్తా"నని అన్నాడట. వెంటనే తనే స్వయంగా ఒక అప్లికేషన్ వ్రాసి, వెంకటేశం చేత సంతకం పెట్టించాడు. ఎక్కడో అక్కడ జూనియర్ తెలుగు పండిట్‌గా, వేయిస్తానని చెప్పి ఆ అప్లికేషన్ తన వెంట తీసుకొని వెళ్ళాట్ట. అంతే! తరువాత ఆ అప్లికేషన్ ఏమయినది వెంకటేశంకి తెలియదుట. వారం గడచింది! పది రోజులు అయినాయి!! పదిహేను రోజులుకూడా దాటాయి!!! కాని ఆర్డర్లు మాత్రమే రాలేదు. ఆ పరంధామయ్యగారు పరధ్యాన్నంగా, ఆ అప్లికేషన్‌ను బుట్టదాఖలు చేశాడో ఏమో! ఇక్కడ వెంకటేశం "చేచిక్కిన అవకాశము జారిపోయినట్లు" బాధపడ్డాడు. చాలా ఆందోళన పడ్డాడు. తనకా యోగం లేదనుకున్నాడు. చివరికి ఎలాగయితేం ఆయనకు అదృష్టం కలసివచ్చింది. నెల రోజులయినాక ఆయనకు "ఆర్డర్లు" చేతికి వచ్చినాయి. కపిలేశ్వరపురం వేశారు. వెంకటేశంకి కంటివెంట ఆనంద బాష్పాలు వచ్చినాయి. ఉత్తరం తెచ్చిన పోష్టుజవానుకి తన సంతోషం కొద్దీ తృణమో పణమో ఒక పావలా ఇచ్చి పంపించాడు. తనకి అదృష్టం ఇన్నాళ్లకు కలసివచ్చినందుకు చాలా సంతోషించాడు. ఆయన ఇంట్లో ఆరోజు పిండివంటలతో భోజనం చేశారు.

ఇది ఆయన నాకు చెప్పింది. "నిజంగా అదృష్టం అంటే అలా ఉండా"లని మనస్సులో అనుకున్నాను. "సరే! మీరు ఎప్పుడు వెళ్ళి జాయన వుతా" రని అడిగాను.

"వారం రోజులు దాక గడువు ఉన్నది. రేపు విదియనాడు వెళ్లి ప్రవేశిస్తాను-మంచి చెడూ చూచుకోవాలిగా!"అన్నాడాయన.

"ఇంతకీ మీ జీతం ఎంతండీ?" అని అడిగాను.

"ఆ, ఏదో మొత్తం అన్నీ కలుపుకొని 45 రూపాయిలదాకవస్తుంది" అంటూ ఆయన వెళ్లి పోయాడు.

సరే తీరా ఆర్డరు వచ్చిన తరువాత వెంకటేశంకి ఒక సంశయం వచ్చింది. తను తీరా వెళ్లి ఉద్యోగంలో చేరితే, అక్కడ పిల్లలతో నెగ్గగలుగుతాడోలేదో అని. ఈఅనుమానాన్ని ఆయన స్నేహితుడు అవధానులకు మాటల సందర్భములలో చెప్పాడు. నాలుగు ముక్కలు చెప్పగలిగి పిల్లలతో నెగ్గటం పెద్ద కష్టంలేదని అవధాన్లు చెప్పాడు. దానితో వెంకటేశం కొంత సమాధాన పడ్డాడు. అవధాన్లు మాటకారి. ఆయన ఏదో చలోక్తిగా "అంతగా నీకు భయంగా వుంటే ఆ ఆర్డరు

ఏదో నాకు ఇచ్చేయి. నేనన్నా వెళ్లి జాయను అవుతాను.'' అన్నాడు. దానితో వెంకటేశంకి చాలా భయంవేసింది. తను ఇంట్లో లేనప్పుడు చూచి ఎప్పుడో అప్పుడు వచ్చి, అవధాన్లు ఆ ఆర్డరు కాస్తా కాజేస్తా డేమోనని అనుమానం కలిగింది. వెంటనే అవధాన్లు అటు వెళ్లి పోగానే ఆ ఆర్డరును గట్టిగాపెట్టెలోపెట్టి తాళంచెవి తన బొడ్లో పెట్టుకున్నాడు. చెప్పేనుగా! వెంకటేశంకి చాదస్తం అని. ఆయన భయానికి కారణం లేకపోలేదు. వెంకటేశంతోబాటు అవధాన్లుకూడా ''ఎంట్రెన్సు'' పరీక్ష కు కూర్చున్నాడు. అయితే వెంకటేశం ప్యాసయినాడు అవధాన్లు తప్పాడు. అప్పటి నుంచి అవధాన్లుకు వెంకటేశం అంటే కన్నెర్రగా వుంది. వెంకటేశం చేసే ప్రతి పనికీ, అవధాన్లు పోటీగా వస్తుంటాడు. వెంకటేశంకి ఒక్కటే భయం. తీరా అవధాన్లు, తనకు తెలియకుండా ఆ ఆర్డరు కాస్తా కాజేసి, ఆ కపిలేశ్వరపురం వెళ్లి, తనే వెంకటేశంనని చెప్పి ఉద్యోగంలో చేరితే తను చేయగలిందేమీలేదు. అందువల్లనే చాలా జాగ్రత్తగా వున్నాడు. సరే! ఏమవుతే అది అవుతుంది. ఉద్యోగాన్ని మటుకు వదలిపెట్ట దలచుకోలేదు వెంకటేశం. కపిలేశ్వరపురంవెళ్లి ఆ ఉద్యోగంలో చేరటానికే నిశ్చయించుకున్నాడు. దానికి తగినట్లుగా ఆయన భార్యకూడా, భర్త ఉద్యోగంచేస్తే చూద్దామని మనసుపడి ఉన్నది. ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చేసుకొన్నాడు. తను ముందువెళ్లి ఉద్యోగంలో జాయిన్అయి, ఇల్లూ వాకిలీ అన్ని ఏర్పాట్లూ చూచుకొని, తరువాత కుటుంబ సమేతముగా వెళ్లటానికి నిశ్చయించు కున్నాడు.

ఇంతలోనే పరంధామయ్యగారు ఏదో పని మీద మా ఊరువచ్చారు. ఆయన వచ్చే టప్పటికి వెంకటేశంకి బ్రహ్మానందమయింది. ఆయన కపిలేశ్వరపురం హైస్కూలు హెడ్మాష్టరుని ఎరుగునట! ఇంకేం! ఆయనకు వెంకటేశంగారిని పరిచయం చేస్తూ ఒక ఉత్తరంవ్రాసిఇచ్చాడు. పరంధామయ్యగారు వెళ్తూ ''హెడ్ మాష్టరుగారిని కాస్త కనిపెట్టుకుండమని, అవసరమైతే, ఆయన ఇంట్లో ఏదైనా శుభకార్యమైతే, వెళ్లిపని జరిపించ''మని సలహాయిచ్చాడు. ఆ ఉత్తరాన్ని వెంకటేశం భద్రంగా దాచి పెట్టుకున్నాడు. మర్నాడు ఉదయం వెంకటేశం నున్నగా గుండు చేయించి, ముస్తాబయి బయలుదేరాడు. అప్పుడే అర్థంచేసుకున్నాను, ఈయన ఉద్యోగంలో జాయిన్ అవటానికి వెళ్తున్నాడని.

ఆయన అటువెళ్లగానే, మా వూళ్ళో ప్రతివాళ్లు ఆయన గురించే మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. ఆయనకు

అదృష్టం ఇన్నాళ్లకు పట్టిందన్నారు. ఆయన కష్టాలు గట్టెక్కినాయన్నారు. అవును! కష్టాలు గట్టెక్కినాయి! కాకపోతే మా వూళ్ళో ఆయన ఎంత కష్టపడితే మాత్రం నెలకి మొత్తం ముప్ఫయి రూపాయిలయినా సరిగా వచ్చేవి కావు. ఆయన అదృష్టం పండింది. మంచి ఉద్యోగం దొరికింది. 'ప్రయోజకుడే మొత్తానికి' అన్నారు ఉద్యోగాన్ని చూచి మనిషికి విలువనిచ్చే వృద్ధులు. వెంకటేశంనుచూచి అసూయ పడేవాళ్ళూ లేకపోలేదు. "అసలు మనిషిని చూచి ఉద్యోగం ఇచ్చివుండరు! ఈయన సంగతి బాగా తెలిసివుంటే వద్దు బాబూ! అనే వాళ్ళే" అన్నారు అసూయతో కొందరు నిరుద్యోగులు. ఇహ "మేడలు కడతాడు చూచుకో - ఆయనకేం! రెండుసంపాదన లాయె! ఇటుస్కూలు వాళ్లు ఇచ్చేజీతం, అటు తీరికవున్నప్పుడెల్లా బ్రహ్మణార్థం మీద వచ్చేడబ్బు? ఇవి కాక ఆయనకు ఓపికవుంటె పిల్లలకు ప్రయివేట్లు చెప్పి బోలెడంత సంపాదించవచ్చు-ఒక్కటేమిటి! ఇహ ఆయనకు ఏమితక్కువ" అని కూడా అనటం మొదలు పెట్టారు వారిలోకొందరు. ఇహ వేళాకోళానికి పిల్లలు "కపిలేశ్వరపురానికి, ఈ కపివరేణ్యుడు వెళ్లాడు. ఇహ ఆ స్కూలులో వినోదానికి తక్కువేమున్నది? పిల్లలకు మంచి కాలక్షేపం" అన్నారు. ఇదంతా వింటుంటే నాకు ఆయనమీద ఒకవిధమైన జాలి వేసింది. పాపం పిచ్చి బ్రాహ్మడు! ఆయనంటే వాళ్లందరకీ ఎందుకింత అసూయ? ఆయనకు మంచి ఉద్యోగం దొరికితే వారందరూ ఎందుకు బాధ పడాలి? అసలు వారందరినీ బాధపెట్టే విషయం వేరేవున్నది. ఊళ్ళో చదువుకున్నవాళ్లు కొంతమంది నిరుద్యోగులుగా ఉండగా, అందరూ చూస్తుండగానే గమ్మత్తుగా ఆయనకు ఉద్యోగం దొరికింది. అదే వాళ్ల బాధ.

వెంకటేశం కపిలేశ్వరపురం చేరాడు. వెళ్లగానే హెడ్‌మాష్టరుగారిని కలుసుకొని, తనకు వచ్చిన ఆర్డరు, పరంధామయ్యగారు వ్రాసియిచ్చిన ఉత్తరంచూపించాడు. హెడ్‌మాష్టరుగారు కాసేపు ఆలోచించి "వెంకటేశంగారూ! ఒక్కవిషయం-మాకు ప్రస్తుతం కావలసినది సీనియర్ తెలుగుపండిట్. ఎందువల్లనంటే, ఇది వరలో మా స్కూలులో పనిచేస్తున్న సీనియర్ తెలుగుపండిట్, ఈమధ్యనే మానుకోవటం వలన ఆ పోష్టు ఖాళీ అయింది; మీకు అభ్యంతరం లేకపోతే మీరు హైక్లాసులు తీసుకోండి. క్రింద క్లాసులకు ఎవ్వరినైనా అడ్డం బెట్టుకొని తంటాలు పడతాం. ఇక జీతంవిషయంలో, మిమ్మల్ని జూనియర్ పండిట్‌గా వేయటం వలన, హెచ్చింపేమీ వుండదు" అన్నాడు. వెంకటేశం కొద్దిగా గాబరా పడ్డాడు. తర్వాత ఎట్లాగో తమాయించుకున్నాడు.

"ఏమిటి సంశయిస్తున్నారు? మిమ్మల్ని సీనియర్ పండిట్‌గా ఉపయోగించుకోమని బోర్డువారు మాకు వ్రాశారు" అని దబాయించాడు హెడ్మాష్టరు. ఈయన అవతారం చూచి, అప్పుడే ఈయన సంగతి కనిపెట్టినట్లున్నాడు! సరే! ఇహ చేసే దేమీ లేదని వెంకటేశం అభ్యంతర పెట్టలేదు. తను దానికి ఒప్పుకోక పోతే ఉద్యోగం తీసివేస్తారేమోనని భయపడ్డాడు. అప్పటికీ మనస్సులో పీకుతూనే వున్నది. తనని తక్కువ జీతంతో ఎక్కువ పని చేయించుకుంటున్నారని; కానీ ఏం చేస్తాడు!

"సరే, అయితే ఇవాళే జాయిను అవండి" అన్నాడు హెడ్మాష్టరు. ఆవేళే వెంకటేశం స్కూలుఫైనలు క్లాసుకు తెలుగుపద్యం చెప్పటానికి వెళ్లాడు. క్లాసు లోకి ఠీవిగానే వెళ్లాడు. లోపల భయంగా వున్నా, పైకి బింకంగానే వున్నాడు. వెళ్లి సరాసరి కుర్చీలో కూర్చున్నాడు. పిల్లలు మామూలుగా ఆయన వస్తుంటే నించుని తరువాత కూర్చున్నారు. అప్పుడే వెనుక బెంచీలో పకపకలు బయలు దేరినాయి. వెంకటేశం పాఠం మొదలు పెట్టాడు. కొంతె పిల్లలు అట్టే కనిపెట్టారు – ఈయన సంగతి. వెంటనే అవకతవక ప్రశ్నలు వేయటం మొదలుపెట్టారు. అక్కడక్కడ కొన్ని కఠినపదాలకి అర్థాలు చెప్ప మన్నారు. ఇంకేముంది! వెంకటేశం నోరెళ్ల పెట్టాడు. కఠిన పదాలకి అర్థం చెప్పమంటే ఆయనేం చెప్పగలడు? ఇంటి దగ్గర ఆపాఠం ఒకసారి చదివి తయారయి వుంటే అప్పుడు ఎలావుండేదో పరిస్థితి! ఏమయినా హైక్లాసు పిల్లలకి పాఠం చెప్ప గలశక్తి ఆయనలో లేదు. ఆయన ఎప్పుడూ ఎవ్వరికీ పాఠం చెప్పలేదాయె! ఏదో చిన్నక్లాసులయితే ఎట్లాగోట్లా తంటాలు పడేవాడు. మొత్తంమీద ఆ రోజున క్లాసులో గందరగోళం జరిగింది. అటాగే మూడురోజులు కాలక్షేపం చేశాడు. క్లాసులో గందరగోళం ఏమీ తగ్గలేదు. పకపకా నవ్వటం, వెక్కిరించ టం, చొప్పదంటు ప్రశ్నలు వేయ్యటం ఒకటేమిటి! ఆయనను ఏడిపించడానికి వారికి చేతనయిన చేష్టలన్నీ చేశారు. ఏమయినా అది కపిలేశ్వరపురమాయె! ఇక వెంకటేశం బొమ్మలు బ్లాకుబోర్డు మీద ప్రత్యక్షమయ్యాయి కొంతమంది కొంటెపిల్లలు "ఏమండీ! మీరు ఎప్పుడు వెళ్లిపోతారండి" అని కూడా ధైర్యంచేసి అడిగారు. ఇక అటువంటి పిల్లలకి ఆయనేం పాఠం చెప్పగలడు! మొత్తంమీద పిల్లలు ఆయనను ఆ ఊరునుండి వెళ్లగొట్టడానికి, వారికి తెలిసిన జిత్తులన్ని ప్రయోగించారు. దానితో వెంకటేశంకి, ఆ ఊరంటేనే ఒకవిధమైన భయంవేసింది. అదే క్లాసుకు శాస్త్ర పాఠం చెప్పగలవాడు, పిల్లలని

హాడల గొట్టగలవాడూ వెళితే పిల్లందరూ బుద్ధిమంతులే! ఇదివరలో ఎంతమంది మేష్టర్లు ఆ క్లాసుకు వెళ్లి పాఠం చెప్పలా! వెంకటేశం అటు పాఠం సరిగా చెప్పలేడు; ఇటు పిల్లలనీ భయపెట్టలేడు. ఆయనకు రెండూ చేతకాదు. అదే వెంకటేశంకి, మిగతావారికీ వున్న పెద్ద తేడా! ఇంతకీ వెంకటేశుని అనవలసిన అవుసరము ఏమున్నది! ఈయన సంగతి సరిగా తెలుసుకోకుండా ఉద్యోగం ఇచ్చిన బోర్డువారిది తెలివితక్కువ! తెలిసివుండికూడా ఉద్యోగం కోసం ప్రయత్నం చేసిన పరంధామయ్యగారిది అంతకంటే తెలివితక్కువ!! అయినా ఆయనను సరాసరి పెద్ద క్లాసులకు వేస్తే, ఆయనేం పాఠం చెప్పగలడు? చిన్న క్లాసులయితే ఎట్లాగోట్లా తంటాలు పడేవాడేమో! ఏమో అదీ నాకు అనుమానమే! ఏది ఎలావున్నా వెంకటేశం అభాసు కావలసిన యోగంవున్నది. అందుకే ఇదంతా జరిగింది.

ఇహ నాలుగో రోజున పరిస్థితి మరీ విషమించింది. క్లాసులో చప్పుడు చెయ్యటం అరవటం, పిల్లికూతలు పెట్టటం మొదలు పెట్టారు. ఇంకా పీరియడ్‌లో సగం కాలేదు, ఇంతలోనే క్లాసులో ఢాం అని పెద్ద చప్పుడు అయింది. అంతే! వెంకటేశంకూడా 'ఢాం' అని కుర్చీలోంచి క్రింద పడ్డాడు. పిల్లలంతా పక్కున నవ్వారు. వెంకటేశంలేచి తెప్పరిల్లుకొని, గబగబా పరిగెత్తుకుంటూ వెళ్లి హెడ్‌మాష్టరుగారి గదిలోనికి దూరాడు. పిల్లలు వెంటపడతారేమోనని ఆయనకు భయం వేసింది. హెడ్‌మాష్టరుగారు ఆయన గబగబరావటం చూచి ఆశ్చర్యపడ్డాడు. వెంకటేశం సరాసరి వెళ్లి ఒక గుక్కెడు మంచినీళ్లు త్రాగి ఆ గదిలోనే ఒక కుర్చీలో కూర్చున్నాడు. హెడ్మాష్టరు అంతా అర్థం చేసుకున్నాడు. కాసేపు ఆగిన తరువాత వెంకటేశం "నన్ను చిన్న క్లాసులకు వెయ్యండి. నేనా స్కూలుఫైనలు క్లాసుకు వెళ్లను" అన్నాడు. "ఏం?" అన్నాడు హెడ్ మాష్టరు.

"ఆ...! ఏమీలేదు" అన్నాడు వెంకటేశం.

అవును! ఏమని చెప్పుకుంటాడు ఆ సంగతులన్ని! హెడ్మాష్టరుకూడా మూడు రోజులనుంచి ఆ క్లాసులో జరుగుతున్న గోల కనిపెడుతున్నాడు. ఇప్పుడు అయిన ఆ చప్పుడుకూడా ఆయనకు వినపడ్డది. ఆయనా, వెంకటేశంని ఎలా వదిలించుకుందామా అని చూస్తున్నాడు.

"అయితే ... ... ... మీరు స్కూలు ఫైనలుకు చెప్పలేనంటారా?" అన్నాడు హెడ్‌మాష్టరుగారు. వెంకటేశం కాసేపు సంకోచించి ఇక ఎట్లాగో తను ఆక్లాసు

పిల్లలతో వేగలేక "చెప్ప లేనండి" అన్నాడు.

"అయితే యెట్లా! మాకు ప్రస్తుతం స్కూలు ఫైనలు క్లాసుకు పాఠం చెప్పగలవాడు కావాలి, మీవల్ల కాకపోతే, ఒకపని చెయ్యండి. మీరు శలవుపెట్టి వెళ్లిపోండి. బోర్డువాళ్లే మిమ్మల్ని ఇంకెక్కడన్నా ఖాళీ వస్తే జూనియర్ పండిట్‌గా బదిలీచేస్తారు" అన్నాడు హేడ్మాష్టరు. వెంకటేశంకి ఈ సలహా నచ్చింది. వెంకటేశం దూరం ఆలోచించాడు. తను శలవుపెట్టితే ఇంకెక్కడికయినా బదిలీచేస్తారు. అక్కడ యెట్లాగో జూనియర్ పండిట్‌గా వేస్తారు గనుక తనకు పాఠంచెప్పటం అట్టే కష్టం అనిపించదు. సరే! వెంటనే శలవు పెట్టాడు.

వెంకటేశం వెళ్లగానే హేడ్మాష్టరుగారు ఆ క్లాసుకు వెళ్లి ఆ చప్పుడు ఎట్లా అయిందని గద్దించి అడిగాడు. సరే పిల్లలు చెప్పక తప్పిందికాదు. ఒక కొంటెకుర్రాడు దీపావళి టపాకాయలలోని ఆటంబాంబును క్లాసులో ఎవ్వరూ చూడకుండా కాల్చాడట! హేడ్మాష్టరుగారు ఆ కుర్రాడికి ఫైన్ వేశాడు.

వెంకటేశం మావూరు చేరుకున్నాడు. ఇహ ఊళ్లో గసగుసలు బయలుదేరినాయి. ఎవ్వరు అడిగినా శెలవుపెట్టి వచ్చానన్నాడు. తనని ఇంకెక్కడికయినా బదిలీ చేస్తూ ఆర్డరు వస్తాయేమోనని, రోజూ పోష్టుఆఫీసు చుట్టూ తిరగడం మొదలు పెట్టాడు. దానికి బదులు వెంకటేశం పేర ఒక మనియార్డరు వచ్చింది. అక్కడ స్కూలులో, నాలుగురోజులు పని చేసినందుకు జీతం లెక్కగట్టి పంపించారు. ఇంకో నెలరోజులు జరిగినాయి. ఆర్డర్లు మాత్రము రాలేదు. అంతే! ఆయన అప్పటికీ, ఇప్పటికీ సెలవుమీదే వున్నాడు.

జర్మను ఏకాంకిక

# ఏకోదరులు

| రచయిత : | అనువాదము : |
| --- | --- |
| గోథేమహాకవి | డాక్టరు వి. ఎన్. శర్మ |

(గతసంచిక తరువాయి)

(రెండో రంగం)

[ఫాబ్రియస్ మరియానా తన దగ్గరనుంచి హఠాత్తుగా వెళ్ళటంతో విషమావస్థలో పడిపోతాడు. ఈ విషాదావస్థనుంచి ఎలా బయటపడాలి? మరియానాను ఎలా ఒప్పించాలి? ఇదే అతణ్ణి బాధించే ఆందోళన]

ఫాబ్రియస్:_(ఆమె వెడుతున్న వైపు తదేక దృష్టితో చూస్తూ........)

మరియనా మనసు చివుక్కుమన్నది.........మరియానా పడేబాధ నాకు తెలియదామరి?......ఆమె వొప్పుకున్నది......ఇక అన్నయ్య అనుమతి కావాలి. ఆయనకూ నా తాపత్రయం బాగా తెలుసు...... ఆయనే నా వాంఛను విన్నాడా – తప్పక వొప్పుకొంటాడు. మా యిద్దర్నీ ఆశీర్వదిస్తాడు......... ఆ విషయంలో సందేహం ఎందుకు?.........ఇంక ముగ్గురం కలిసే వుంటాం. నేను పరాయి వాణ్ణి అయితేకదూ! ...... ఆయన నా బావమరిదేగా! ఎందుకు చెప్పు మాకీ సంకోచం! ఊమ్మడిగా వ్యాపారాన్ని నిర్విఘ్నంగా నడుపుకోవచ్చు. ఆయనకూ కావలసిన విశ్రాంతి వుంటుంది. ఫాబ్రియస్! నీవే నోయ్ అదృష్టవంతుడివి; నీ భాగ్యమే భాగ్యం! ప్రేమలక్ష్మినే వరించావు. ఇంకేంకావాలి నీకు చెప్పు మరి!

[విల్‌హెం లోపలికి వస్తాడు]

ఫాబ్రియస్_:(చిరునవ్వుతో) బయట పనినంతా చక్కబెట్టుకొని వచ్చావా?

విల్‌హెం_:అఁ.........ఆ ఈలా బయటగాలిని పీల్చుకొనే భాగ్యం ఎప్పుడూ వుంటేనో......... చేయాలసిన కార్యకలాపాన్నంతా హాయిగ చక్కబెట్టుకొనివచ్చాను. ఆ అలసటంతా మటుమాయమైపోయింది. ఇంత అదృష్టం అందరికీ వుంటేనా! పాపం,– వాళ్లందరూ, అంగళ్లలో ఇంత స్వేచ్ఛగా ఎలా తిరగగలుగుతారు?...... మార్కెట్టు బజారులో చూడవలసిన వార్ని చూచాను. దేవాలయం మార్గాన నడుస్తూ వున్నప్పుడు, ఒక ముసలావిణ్ణి చూశాను. ఆవయస్సులో ఎంతో వోపికతో అంగట్లో కూర్చుండి వ్యాపారం చేస్తున్నది!.........ఆ చిత్రాన్ని చూస్తూ, నివ్వెర పోయాను. ఒక నిమిషం ఆ అంగట్లో కూర్చుండి ఆవిడ చేస్తున్న పనిని కండ్లారా చూశాను........

ఫా:_అవును బజార్లో నడుస్తూవుంటే ఇట్టి వింతల్ని ఎన్నిటినో చూడొచ్చు. విధి, విరామం అనే విషయాన్ని వాళ్లేమాత్రం తలంచకుండా రాత్రింబగళ్లూ పని చేస్తూవుంటారు.

విల్‌హెం:-కాయకష్టం, మనోనిబ్బరం లేకుంటే వ్యాపారాల్లో ఏంలాభం వస్తుంది చెప్పు! ఎలాటి చిన్న చిన్న వ్యాపారాల్లోకూడ వోపిక వుండాలి; శ్రద్ధవుండాలి లేకపోతేనా-ఈ రథం స్వయంగా నడవడానికి అవకాశం వుంటుందా

మరి? (తనలో) ఈలా షికారుకు వెళ్లటం మంచిదే. ఇంతకు ముందుచూడని వింతల్ని ఎన్నిటినో చూడ వచ్చు. వాటిని తలుస్తూ వుంటే......ఎన్నో తలంపులు వస్తూన్నాయి. జీవితం మధురం - ఆనందం - దీన్ని మనం గ్రహించామా !......

ఫా:_(తనలో) ఈయన ఆలోచనలు, ఆ ఆనంద మున్ను నాకూ తెలుసు......మరియా ప్రేమించా నని ఈయన గ్రహించేవుంటాడు......అయితే నేం - ఆ సంగతినతనితో చెప్పాలి......(చిరు నవ్వుతో) విల్ హెం! మనం ఇంకో ఇంటికి పోవడం నీకిష్టమేనా? మన వ్యాపారం ఎక్కువ చెయ్యడానికి ఈ ఇల్లు చాలదు... ......మనకు అనుకూలమైన లోగిలి మరొక్కటి ఈ వూళ్లో దొరుకుతుందా ?

విల్:_(కట్టిగా నవ్వుతూ) మరో లోగిల్ని చూడడం ఎందుకు?

ఫా:_మనం ఇద్దరం కలిసి వ్యాపారం చెయ్యాలని నా కోర్కె. మా ఇల్లు చాలా పెద్దది............మనం వుండడానికీ, వ్యాపారాన్ని పెద్దయెత్తున చేయ డానికీ సరిపోతుంది......నువ్వుకూడ పెళ్లి చేసు కుంటావుగా.. మా లోగిలి రెండు కుటుంబాలకూ చక్కగా సరిపోతుంది...

విల్:_(చిరునవ్వుతో) నువ్వు మంచివాడివోయ్!... కాని ఈ ఇంటిని వదలి పెట్టి రావడం కష్టం— మనం ఆలోచించాలసిన సంగతులు ఎన్నో వున్నాయి ......... అబ్బే, – అబ్బే – ఏమున్నాయ్ అలా ఆలోచించటానికి?.........

ఫా:_అలా అంటే......ఇంటిని మార్చడంలో కష్ట మేముంది మరి?

విల్:_ఆ!......ఆ మార్పు....పెళ్లిచేసుకొంటానికి పూనుకొంటేకదూ?

ఫా:_అలా కాదు. ఇంతకాలమూ చెల్లి దగ్గర్నే వున్నావు. కాని ......ఎంతకాలం ఈ ఏకాకి జీవితం.........నీవూ అంత పెద్దవాడివికాదు పెళ్లి చేసుకోవాలి... అప్పడే సుఖం అనేది, శాంతి అనేది అబ్బుతుంది.

విల్:_అయితే... .. నా చెల్లెలి సంగతో?

ఫా:_దాన్నంతా చక్కబెట్టుకోడానికి నేనున్నాను కదూ ! ఆ విషయాన తాపత్రయం పడనక్కర లేదు.

విల్:_(మౌనంగా వుంటాడు).

ఫా:_విల్ హెం ! ఒక సంగతి చెప్పదల్చుకొన్నాను. ... మరియానాను ప్రేమించాను. ఆవిణ్ణి పెళ్ళాడ టానికి నీ అంగీకారం కావాలి. మమ్మల్ని ఆశీర్వ దించాలి. ... ...

విల్:_(ఆశ్చర్యంతో). ఆలా జరగటం. ...

ఫా:_ఎందుకుకాదు! ఆశీర్వదించు. ఈ దివ్యదినం కోసం ఎంతోకాలంనుంచి వేచివున్నాను. మరి యానా నా భాగ్యదేవత. నేను వాంఛించుతూ వున్న సుఖాన్ని ఆనందాన్ని మరియానా ప్రసా దించుతుంది. నన్ను ధన్యుణ్ణి చేస్తుంది.

విల్:_(కోపంతో) నువ్వు ! ఏంవాంఛించుతున్నావో ఆ సంగతే ... ... నీకు తెలియదు.

ఫా:_ఎందుకు తెలియదు ? నా మనోవాంఛను మరి యానాకే చెప్పాను. మరియానా నా భార్య- నువ్వు బావమరిదివి. ...

విల్:_(విచారంతో) కోరికలు నీకు వున్నా ... ఆ పొత్తు కుదరటం అసంభవం.

ఫా:_ఎందుకాలా అంటావు ? ... దీనికోసం ఇంత కాలం తపించిపోతున్నాను. ...

విల్:_కొంచెం ఆ గాలి ... నాకేమతిపోయినట్లుంది.

ఫా:_అలా తటపటాయించటం ఎందుకు ? నేను చెప్పదల్చుకొనేది చెప్పనియ్యి - నా భవిష్య త్తంతా దీనిమీదే ఆధారపడివుంది. నా శోధ

ఆవిడకు బాగా తెలుసు. ... మరియానాకు నీ వంటే ఎంతో అభిమానం. ఆ రహస్యాన్ని విస్మరించగలనా మరి! మనం కలిసి మెలసి వుంటాం. ... ఇంతకన్నా మరేమీ కోరటంలేదు. ... నేను మిత్రుణ్ణేకాదు - బంధువును కూడాను! నీవు ఈ దాంపత్యానికి అంగీకరించాలి. ఇదేనా ప్రార్థన. అప్పుడే నేనూ ఒక గట్టుకు చేరుకోగలుగుతాను.

విల్:—(విచారంతో కొంచెంసేపు మౌనంగా వుంటాడు. ... ఆలోచనా సముద్రంలో మునిగి తేలుతూ...) అయితే మరియానా అంగీకరించవద్దూ!

ఫా:—తన అంగీకారాన్ని ప్రేమ చూపుల్తో తెలిపింది.

విల్:—దాంతో అంతా పూర్తి అవుతుందా?

ఫా:—(నిస్పృహతో) ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటి? ... ఈ విషయంలో నీవేమాత్రం అడ్డురావని తెలిసినా ... నన్ను ఒక దారికొంకలకు చేర్చే భారం నీదే. నాకు జీవితంలో కావలసిన సౌఖ్యాన్ని ప్రసాదించు.

విల్:—(మాట్లాడడు. ఏదో ఆలోచించుతూ వుంటాడు)

ఫా:—(విచారంతో) ఒక మాట చెప్పు ... విల్ హెం! నా వైపు ఒకసారిచూడు ... ఏమిటా ఆలోచన. నాకు చెప్పవూ మరి?

విల్:—మరియాను పెళ్ళాడ తలచావా?

ఫా:—...అంటే?

విల్:—మరియానా అంగీకరించిందా?

ఫా:—ఒక కన్య ఇట్టి సందర్భమున చెప్పవలసిన దాన్నే-

విల్:—అ! ... అ! అలా జరుగుతుందనే అనుకొన్నాను.

ఫా:—అంటే ... నా కోరికను ...

విల్:—(నిట్టూర్పు విడుస్తూ) ఫాబ్రియస్! ఇంకేం చెప్పాలి? అలా జరుగుతుందనే ఇంతకాలం చిందర వందరై పోయాను. ఆ మేఘం ఇవ్వాళే వచ్చింది. దాంతో తుపాను కొట్టింది. ... నా మరియాను తీసుకొంటావా? నా జీవిత భాగ్యాన్నే హరించటానికి వచ్చావా? మరియానా నా సర్వస్వం - ఆ సంగతి తెలిసీ నా మరియానాను నా దగ్గర్నుంచి తీసుకోదలచావా? (కొంతసేపు మౌనం ... ఏదో ఆలోచించి ఉక్కిరి బిక్కిరయిపోతాడు.) నా చార్లొటా! నా ప్రాణమూర్తి... చార్లొటాను గురించి చెప్పానుకదూ! ... నన్ను అనాథను చేసి నాచార్లొటా మటుమాయమైపోయింది. ... ఈ పిల్లను మాత్రం నా దగ్గర నాకు అండగావుంచి తన లోకానికి హాయిగా వెళ్ళిపోయింది. ... మరియానా ఆవిడ కూతురు. చెల్లెలని అబద్ధం చెప్పాను. ... చార్లొటా చావలేదు. మరియానాను చూస్తూ వుంటే ఆవిడ మరణించిందని ఎలా చెప్పగల్గుతాను? ...

ఫా:—(ఆశ్చర్యంతో) ఆ రహస్యాన్ని ఇంతకాలం ఎందుకు చెప్పావుకాదు?

విల్:—(విచారంగా) ఇక ఆ సంగతి చెప్పాలి. చెప్పకపోతే మనశ్శాంతి ఎలా వుంటుంది? నిన్ను ఆనాడు చూచినప్పటినుంచి ... ఆ సంగతి నీకేం తెలుసు? ... కాని ఇంతకాలం ఈ రహస్యాన్ని గుప్తంగా దాచాను. ఇక దాన్ని కప్పిపెట్టడానికి వీలుంటుందా? ... నా సంగతి నీకే పూర్తిగా తెలిస్తే ... నేను మంచి వాణ్ణని, స్నేహపాత్రుణ్ణని ... అంతే, అంతే నీకు తెలుసు. ... ఇప్పుడో - నీవూ ... అది. ...

ఫా:—ఎందుకాలా అనడం? వాటికి జవాబు చెప్పలేను. ... నమస్కారం. ఇక వెళ్తాను.

[బయటికి వెళ్ళిపోతాడు]

(సశేషం)

# వివిధదేశాల విజ్ఞాన వినోదాలు:

'యం. యస్. యస్.'

ఒంటె చక్కెర మోస్తుంది; అయినా ముళ్లే తింటుంది. (కుర్దిస్తాన్)

పక్షికి రెక్కలు బరువా? (టర్కీ)

ఒక పాలు చదువుంటే పదిపాళ్లు లోకజ్ఞానం కావాలి. (పర్షియా)

పిల్లికి పెట్టనివాడు, ఎలుకలకి పెట్టే తీరాలి (జర్మనీ)

పాటను బట్టి పక్షినీ, మాటను బట్టి మనిషినీ తెలుసుకోవచ్చు.

తాగినా, తాగకపోయినా చావు ఉంది; కనక తాగే చచ్చిపోదాం (రష్యా)

ఆగిపోయిన మిల్లుకంటె గుడ్లు పెట్టే కోడి మెరుగు (స్కాట్లండ్)

గడించిన వాడిది కాదు డబ్బు; అనుభవించేవాడిది (ఇటలీ)

తోక పోతేగాని విలువ తెలీదు ఆవుకి (జర్మనీ)

కళ్లు మూసుకుంటే అంతా అంధకారమే (మలబార్)

ధనవంతులు తింటారు; పేదవాళ్లు కంటారు (రష్యా)

ఎప్పుడో పనసలు పండుతాయని ఇప్పటి నుంచీ పెదవులకి నూనె రాసుకు కూర్చున్నాడట (అస్సాము)

'ఒంటే! ఒంటే! నీ మెడ వంకరగా ఉందేం?' అని అడిగితే—'నాకు తిన్నగా ఉన్నదేమిటి?' అన్నాడట. (టర్కీ)

ముదుగు నేసినవాడు ముందరకి వచ్చాడు; సన్నం నేసినవాడు చదికిల బడ్డాడు (తెలుగు)

మేక తిననిదీ, మూర్ఖుడు వాగనిదీ ఏమిటుంటుంది? (బెంగాల్)



# చిత్రకారుని చిత్రాలు

శ్రీ కావుటూరు వెంకట నారాయణరావు

[చుట్టూ గోడలమీది చిత్రాలు చెయ్యానులును విపరీతంగా ఆకర్షించినవి — చిత్రకారుడెవరా అని గాలించసాగాడు. చిత్రకారుడు తటస్థపడ్డాడు — దట్టంగా పెరిగిన గడ్డం, తైలసంస్కారములేనిజుట్టు, దుమ్ము ధూళితోనిండిన చింపిగుడ్డలతో — అతని జీవితచరిత్రలో ఏదో గూఢమైన ప్రత్యేకతయుండి యుండాలనుకున్నాడు. గదికి తీసికొని వెళ్లి స్నానం, భోజనమయ్యాక చెయ్యానులు తనపక్కమీద చిత్రకారుని కూర్చొనబెట్టి అతని జీవితచరిత్రను తెలిసికోవాలనే ఆసక్తిని తెలిపాడు — తను పుట్టినప్పటినుండి నిరాధారులైనతను, తన అక్కయ్య ఎలా పెరిగింది. తన్ను పోషించడానికి తన అక్కయ్య పడ్డ పాట్లు — చివరకు ఆ గ్రామంనుండి సయితం లేచి పోవలసిన పరిస్థితులు - అక్కడనుండి బస్తీకి చేరి తన అక్క ఒక మహారాజింట్లో చాకిరికి కుదరడం, తాను తన యూహకందిన చిత్రాలను గీచి కొద్దో గొప్పో సంపాదనతో జీవయాత్ర సాగించుచుండటం — యిక చదువండి]

(గతసంచిక తరువాయి)

"నేను రచించిన బొమ్మలు చాలా అమ్ముడుపోతుండేవి. అందులకు నాకెంతో సంతోషంగా వుండేది. నేను రచించిన బొమ్మలు కొందరికి వూరికేనే యిచ్చివేసేవాణ్ణి. కాని నా జీవితం యిలా అన్యాయం కావడానికి ఆ బస్తీయే పునాది వేసింది. మా జీవితం సుఖంగా గడిచిపోవడం ప్రకృతికి కళ్ళు కుట్టింది. మరల మా కష్టదశ వ్రేళ్ళు బెట్టసాగింది."

"మా అక్కయ్య పనిచేస్తున్న ఆ యింటి యజమానికి ఒకకొడుకున్నాడు. అతను కాషాయ వస్త్రాలు కట్టుకున్న బ్రహ్మచారి. మనసు ఆ దశలో లేదు. అతనొక గోముఖ వ్యాఘ్రం - పయోముఖ విషకుంభం. అతని గుట్టంతా మా అక్కయ్య తెలుసుకుని నాకు తెలిపింది. ఆ తుచ్ఛుని బందిబడకుండ వుండమని మా అక్కయ్యను హెచ్చరించాను. అతని మాటంటే మా యిద్దరికీ చిరాకు కలిగించేది. అతను మా అక్కయ్య అక్కడ పనికి కుదిరినప్పటినుండి ఓ కన్ను వేశాడు. అది నాకు తెలిసిందికాదు. లేకపోతే అప్పుడే అతనిని కండను కండ విడదీసి ఆనందించేవాణ్ణి."

"నేనొక రోజు కంపెనీలో పనిజాస్తయినందున మా అక్కయ్యతో ఆ రోజు కంపెనీలో పడుకుంటానని చెప్పి వెళ్ళాను. ఆ మాటలతో యెందుకో మా అక్కయ్య సంకోచపడింది. నా మనసుకూడా యెందుకో తల్లడిల్లింది. మా వంటివారి జీవితాలు యెప్పుడూ యిలాంటి అపాయాలకు దురవస్థలకు గురికావడం సహజమే! నేనా ప్రొద్దున పోయినవాణ్ణి మరుసటిరోజు తెల్లవారిదాకా తిరిగిరాలేదు. ఈలోపల జరిగిన సంఘటనే నా జీవితానికి కఠిన పరీక్షయింది. ఆ సంఘటనే నా జీవితాన్ని యీ విధంగా మార్చివేసింది. నేను మరు రోజు ప్రొద్దున యింటికి

తిరిగి వచ్చాను. మా అక్కయ్య నాకగుపించలేదు. ఆమెకోసం ఆ యిల్లంతా వెదికాను. కానీ నాకెక్కడా ఆమె జాడే అగుపించలేదు. నా హృదయం భయంతో కంపించిపోయింది. విచారంతో తల్లడిల్లింది. తిరిగి తిరిగి నా దేహం కూలిపోయింది. ఆ రోజంతా నాకామె జాడ తెలియలేదు. నాకేమీ తోచక నా మంచంమీద వాలిపోయాను. ఆ మంచం మీదనే అగుపించింది మా అక్కయ్య వుత్తరం."

"ఆ వుత్తరం చదువుతుంటే నా రక్తం వుడికిపోయింది. నా నాడులు వుబ్బిపోయాయి. ఆ తుచ్ఛుడు, నే నెవరినైతే అంతగా అనుమానించానో అతనే, ఆ యింటి యజమాని కుమారుడు మా అక్కయ్య జీవితం నాశనంచేశాడు. ఆమె ఆ గాత్రే ఆత్మహత్యచేసుకుంది."

"అంతవరకు నా అని చెప్పుకోదగ్గ ఓ వ్యక్తి నా యెదుట వుండేది. ఆ వ్యక్తికూడా దూరమయింది. నేనుకూడా యీ లోకంనుండి దూరమౌదామనుకున్నాను. ఆ తుచ్ఛుడు యింకా యీ జగంలో జీవించి వున్నాడంటే నా హృదయం వుడికిపోయింది. ఆ రాత్రే అతనిని నిద్రబోతున్నపుడు పొడిచివేశాను. ఈ మాటలు మీకాశ్చర్యం కలిగించలేవు. ఆలోచించనుకూడా అవకాశమివ్వవనుకుంటాను"

"అమాంతంగా, ఓ ప్రాణిని నా చేతులారా యీ లోకానికి దూరంజేశాను. అందుకు లోకం నాకు తగిన శిక్ష నాకు వేయలేదనుకుంటాను. నన్ను పట్టుకున్నారు. న్యాయస్థానంలో నేను హంతకుణ్ణని నిర్ధారణ జేశారు. ఆ నాడే నన్ను ఆ వూరి జైల్లో వేశారు."

"నే నెప్పుడు జైలులో చేరానో నాకు తెలియదు. కానీ ఓ సంవత్సరంగనుట్టుకు జైలు జీవితం అనుభవించాను. సర్వ ద్రోహులకు, అన్యాయాలకు స్థానమైన యీ సమాజ జీవితంకంటె ఆ జైలు జీవితమే నాకెంతో హాయినిచ్చింది. నా జీవితం ఆ జైలు కటకటాలలోనే అంత మొందించమని దేవుని ప్రార్థించాను. అక్కడ నా చిత్రకళకు యౌవనం అంకురించింది. నేను ఆ జైలు జీవితంలో యెందరినో చూచాను. వారి ప్రకృతు లిలాంటివని అర్థంచేసుకున్నాను. వారిలో నాలాంటి హంతకు లెందరో వున్నారు. కానీ వారి జీవితం నాతో పోల్చుకో దగ్గదిగాదు. యెప్పుడూ ఆ జైలులోగూడా యేకాంతంగా వుండాలని ఆశించేవాణ్ణి. కానీ నన్ను విడుదల చేశారు. మరలా యీ సమాజంలో అడుగు బెట్టాను."

"నేనప్పటినుండి పిచ్చివానిలా తిరిగేవాణ్ణి. నన్ను లోకంకూడా పూర్తిగా పిచ్చివాణ్ణి చేసింది. నే నెన్నో వూర్లు తిరిగాను. నా పాప పరిహారంకోసం యెందరి దేవతల చిత్రాలో భక్తితో చిత్రించాను. కాని నా జీవితం యిలాంటిదని యెవ్వరికీ తెలిసిందిగాదు. నా పాపానికి పరిహారం యేమీకనుపించలేదు. నా హృదయ భారం తగ్గించుకుందామన్నా నా కథ వినేవాడెవ్వడూ లేకపోయాడు. అంతటితో నా నోరు కట్టుబడిపోయింది; కాని నా మనసులో యే ఆలోచనలుండేవో నాకే తెలిసేదిగాదు"

"నే నెక్కడ కాలుపెట్టినా నన్ను చిత్రాలు వ్రాయమని బలవంతపెట్టేవారు. నాకు విసుగుకలిగి వారి మాటలు వినేవాణ్ణిగాదు. నా యిష్టమొచ్చినపుడు యే గోడమీదనో బొమ్మలు గీచేవాణ్ణి."

"నేను పిచ్చివాణ్ణి కాకపోయనా యీ లోకం నన్ను పిచ్చివాణ్ణిగా చేసింది. ఇప్పుడు నేనొక యేకాకినయినందువలన నా పొట్టపోషించుకోడం నాకొక సమస్యగాదు. ఇదీ యిప్పటివరకు నా గాథ. ఇంకా నా అభూత జీవితంలో యెన్నో విషాద సంఘటనలు జరిగాయి. అవన్నీ చెప్తే మీకు కష్టంకలిగించినవాణ్ణిగా తయారవుతానేమో!"

ఆ చిత్రకారుడు తన చరిత్ర ముగించేటప్పటికి రాత్రి పదకొండు కొట్టింది. తన మంచంమీద ఆ చిత్రకారుడు నడుంవాల్చాడు. ఆ చిత్రకారుని సంఘటనలను, అతనిపట్ల సమాజంలో జరిగిన అన్యాయాన్ని గురించి ఆలోచించుకుంటూ తనూమరోచాపమీద నడుం వాల్చాడు, చెయ్యానులు.

చెయ్యానులు ప్రొద్దుననే లేచాడు. తన కళ్ళు నిద్రనుండి తెరిచాడో లేదో జిగేలుమన్నాయి. తన యెదుటవున్న గోడ ముందు తెల్లగా వెల్లవేసి వుండేది. కానీ యిప్పుడా గోడమీద శేషశాయి పవ్వళించి వున్నాడు. తనగదిలోని మూడు ప్రక్కలా మూడు బొమ్మలు వేసివున్నాయి. ఒక తట్టు రవివర్మలక్ష్మి వేసివుంది. మరో ప్రక్క తన స్వరూపమేవుంది. చెయ్యానులు ఆశ్చర్యపోయాడు. తన పోలిక అంత బాగా వేయగలిగాడంటే అతని నైపుణ్యానికి తను విలువగట్టలేకపోతున్నాడు.

చెయ్యానులు ఆ చిత్రకారుని తన గదిలో చూడలేక పోయాడు. చుట్టుప్రక్కల యెక్కడా అగుపించ లేదు. తనతనిమీద యెన్నో ఆశలు పెట్టుకుని వున్నాడు. సాధ్యమయితే అతని నొక ప్రసిద్ధ చిత్రకారునిగా లోకానికి పరిచయం చేయదలుచుకున్నాడు. అలాంటి ఆలోచనలన్నీ యెండమావులలా అగుపడి మాయమయ్యాయి.

ముందు తనగది దేనికీ కొరగాకుండా పడివుండేది. ఇప్పుడా చిత్రకారుని నైపుణ్యంవలన ఓ కళామండపంలా తయారయింది. తన గదిని తెరచివుంచితే కొన్ని రోజులలో ఓ చిత్రవస్తు ప్రదర్శనశాల కాగలదు. ఆ చిత్రకారుని సంచికూడా తన గదిలోనే వుంది. దానిలోవున్న బొగ్గులన్నీ మాయమయ్యాయి. వాటితోనే ఆ రాత్రి ఆ చిత్రకారుడు, తను నిద్ర పోతుంటే ఆ బొమ్మలు వ్రాసివుంటాడు. తన దురదృష్టంవలన అతను చిత్రాలు వేసేటప్పుడు మెలుకువ రాలేదు. ఆ ఒక్క రాత్రిలో మూడు బొమ్మలు అంత మనోహరంగా యెవ్వరూ వేయలేరు. ఆ చిత్రకారుని లాఘవానికి చెయ్యానులు ఆశ్చర్యపోయాడు.

ఆ నాడే తన బొమ్మ మునిసిపల్ మార్కెట్ గోడమీద కెక్కింది. చెయ్యానులుకేమీ తోచలేదు. తిరిగి అతనికోసం వెదక ప్రారంభించాడు. నాలుగైదు రోజులూ యువక చిత్రకారుని కోసం మునిసిపల్ మార్కెట్ ముందు కాచుకూర్చున్నాడు. కాని ఆ చుట్టు ప్రక్కల ఆ చిత్రకారుని జాడేలేదు. అతని కోసం చెయ్యానులు వూరంతా తిరిగాడు. తనకు ప్రతి దినం ఓ క్రొత్త చిత్రం అగుపిస్తూనేవుంది. దానివలన ఆ చిత్రకారుడు వూర్లోనే వున్నాడని తెలుసుకున్నాడు చెయ్యానులు. మరలా తన అన్వేషణ మరీ పట్టుదలతో సాగించాడు. కాని తన ప్రయత్నం విఫలమయింది. తుదకు నిరాశతో అతని చిత్రాలను చూస్తూ అతని మూర్తిని భావించుకొంటూ వుండేవాడు.

ఓ నెల రోజులు గడిచిపోయాయి. అప్పుడప్పుడు చెయ్యానులా చిత్రకారుని కోసం తిరిగేవాడు. ఓ నాడు చెయ్యానులు యేదో పనిమీద ట్రంకురోడ్డు గుండా బహు త్వరగా వెళ్లుతున్నాడు. వచ్చేపోయే కార్లకు, బండ్లకు, రిక్షాలకు తెరపిలేకుండావుంది. రోడ్డుమీద జనం కిటకిటలాడుతున్నారు. చెయ్యానులు ఓమూల తిరుగుడు దగ్గరకు వచ్చాడు. ఇంతలో రెండు కార్లు మోదుకున్నాయి. పెద్ద శబ్దమయింది. ఆ కార్ల నడుంగల ఓ మనిషి పడిపోయాడు. అందరూ గుమిగూడారు. చెయ్యానులు గూడా ఆ సంఘటను చూడడానికి వెళ్ళాడు.

ఆ కార్లక్రింద పడ్డమనిషి గుర్తు పట్టడానికి వీలు లేకుండా చితికి పోయడు. అందరూ అది ఓ వింతలా చూస్తున్నారేగాని యెవ్వరూ ఆ మనిషిని లేవదీసి హాస్పిటలుకు పంపేవారెవ్వరూ లేకపోయారు. చెయ్యానులుకు ఆ మూర్ఖులను చూస్తుంటే హృదయం తరుక్కుపోయింది.

చెయ్యానులు ఆ దెబ్బతిన్న వ్యక్తిని మెల్లగా ఆ కార్ల సందునుండి లేవదీయడానికి కొందరిని సహాయమడిగాడు. ఆ గుంపులో కొందరు సహాయం చేశారు. ఇంతలో పోలీసులు ఆ విషయం తెలుసుకు పోదామని వచ్చారు. వారివృత్తికి అదే ముఖ్యమయిన పనను కున్నాడు చెయ్యానులు !

చెయ్యానులు ఆ గాయపడ్డ వ్యక్తిని పరికించాడు. తలంతా చక్రాల సందున పడి ఆనవాలులేకుండా పోయింది. మెల్లగా అతనిని దీసి ఓ కారులో పరుండబెట్టి తనూ కూర్చున్నాడు. ఆకారు గవర్నమెంట్

హాస్పిటలుకు బయలుదేరింది.

హాస్పిటలింకా సమీపించలేదు. ఆ దెబ్బతిన్న వ్యక్తి మెల్లగా కదిలాడు. చెయ్యానులు అతని ముఖాన్ని పరికించి — పరికించి చూచాడు. తన హృదయంలో ఆందోళన బయలు దేరింది. చెయ్యానులు అతనిని పూర్తిగా ఆనవాలు పట్టాడు. తన హృదయంలో ఆటంబాంబు పడ్డట్లయింది. అతనే ఆ చిత్రకారుడు.

అతను మెల్లగా కదులుతున్నాడు. యేదో కలవరింతగూడా వస్తూంది. ఇంకా కారు హాస్పిటలు చేరలేదు. చెయ్యానులు ఆ వ్యక్తి ఆరోగ్యం కోసం సర్వదేవతలకు మ్రొక్కుకున్నాడు. ఆ చిత్రకారుడు ఓ సారి తన కళ్ళు తెరచి చెయ్యానులు తట్టు చూచాడు. చెయ్యానులు ఆత్రంతో అతనికళ్ళతట్టు చూచాడు. యిద్దరి చూపులు కలుసుకున్నాయి. కారు హాస్పిటలు ద్వారం సమీపించింది. ఆ చిత్రకారుడు కళ్ళుమూశాడు. అతని ఆత్మజ్యోతి సూన్యంలో కలిసిపోయింది. చెయ్యానులు హృదయంలో చెలరేగిన తుఫాను తగ్గిపోయింది. తనకంటినుండి రెండు వేడి నీటి చుక్కలు అతని హృదయం మీద జారి పడ్డాయి.

చెయ్యానులు. యిన్నాళ్ళుగా యెవరినైతే ఆశించాడో ఆ వ్యక్తి యీ లోకంనుండే దూరమయ్యాడు. లోకం తనచేతులతో ఓ ప్రసిద్ధ చిత్రకారుని బలి చేసింది. ఆ వ్యక్తి యెలా యీలోకానికీ దూరమయ్యాడో అతని కళకూడా దూరమయింది.

అతను వేసిన చిత్రాలన్నీ మాసిపోయాయి. కానీ తనగదిలో చిత్రాలు మటుకు కళతగ్గలేదు. వాటి ప్రక్కనే చెయ్యానులు ఆ చిత్రకారుని రూపు చిత్రించుకున్నాడు. అటువంటి చిత్రకారుని తను పోగొట్టుకున్నందుకు తనజీవితం వ్యర్ధమనుకున్నాడు. ఆ చిత్రకారుని దరితీసి పైకితీసుకురాలేని రాజపోషకులు యీ లోకంలో యెంతమంది వున్నారో వారినందరనీ దూషించాడు. .

చెయ్యానులు ఆ చిత్రకారుని ఆశయాన్ని తను నెరవేర్చదలచుకున్నాడు. అతను జీవిత గాధను లోకానికి తెలిపితే అతని ఆత్మకు శాంతి కలుగుతుందనుకున్నాడు. తనకు దోవలో యెవరెదురైనా వారిని తన గదికి ఆహ్వానించేవాడు. తనగదిలోని చిత్రాలను చూపేవాడు. ఆ చిత్రాలను చూచినవారు కదిలిపోయేవారుకాదు. వారికి ఆ చిత్రకారుని విషాదగాధ తెలిపి రెండు కన్నీటి చుక్కలు వదిలేవాడు. ప్రతి దినం అతనికిదొక విధ్యుక్త కర్తవ్యమయింది. ఆ చిత్రాలను, ఆ చిత్రకారుని తనెలా లోకానికి పరిచయం చేయగలనోనని యెప్పుడూ ఆలోచించేవాడు. దానికి తగిన శక్తినిమ్మని దేవుని సర్వ విధాలా ప్రార్థించేవాడు. ఆ చిత్రకారుని ఆత్మ శాంతికి తను దినం దైవప్రార్థన సలిపేవాడు.

చెయ్యానులు యిప్పటికీ అలానే చేస్తున్నాడు. అదే అతని హృదయభారాన్ని తీసివేయగలుగుతుంది.



# పాములవాడు

శ్రీ రాచకొండ శ్రీహరి

ఈ అనంత విశ్వంలో ప్రతి ఆకు ప్రతి పూవు, ప్రతి అణువు రససృష్టికి గోపనంద బుచ్చే దివ్యవస్తువే.

ప్రకృతిలో ప్రవహించే ఆ యా రసవాహినులనుండి కళోపాసకుడు తనకందిన భావాలను విరిహారాలు గ్రుచ్చుకుంటూ వుంటాడు.

లలిత కళలకు ఆధారమైన వస్తు స్వరూపాలన్నిటిలో మానవుడు ఉత్తమస్థాన మాక్రమిస్తున్నాడు. మానవుడి హృదయంలో అనుక్షణం పైకిబికే భావోద్దీపనలన్నీ కవితాలోకానికి కానుకలే. మానవహృదయం అతి విశాలమైనది; ఆ హృదయ పరిణామాన్ని అర్థంచేసుకొని అన్వయించుకొని వాటిని ఉత్తమైన వర్ణనలలో చిత్రించగలుగుటయే కళాస్రష్టల విధి.

అడవిలో పూసిన మల్లెపూలలో కూడా—మనం పందిరు లల్లి పెంచిన పొదరింటి పూవులకు గలంత పరిమళం వుంటుంది; రాణింపు వుంటుంది. కాని అవి అడవినబడి, అలంకారాయోగ్యం కాలేక ప్రకృతికే తమ సౌరభ్యాన్ని అంకితంచేసి నశించి పోతవి. కవితావేశంగల హృదయం ఆ పూవును చూచినపుడు దానిలోని సౌందర్యాన్ని, సత్యాన్ని వర్ణించి లోకానికొక పాఠం చెప్పకుండా వుండలేదు.

మానవ సంఘంలో కూడా అలా ఆడవి పూవులలాగా విసిరవేయబడినట్లు పడివున్న జాతులెన్నో వున్నాయి. వారి హృదయాలలో పవిత్ర ధర్మం, స్వార్థత్యాగం, ప్రేమ మొదలైనవి పరిపూర్ణత చెందివున్నాయనేది లోకానికి మాటిమాటికీ వినిపించవలసిన ఒకపాఠం.

ఎక్కడో ఏ చెట్లనీడనో, దూరపు అడవులలో నివసించుతూ తమ సంఘానికి తామే ఒరులు అమర్చుకొని, ఒక్క నీతికి కట్టువడి, ఒక్క మాటకు తలవొగ్గి బ్రతుకనేర్చిన శక్తిగల పాములవాళ్ల హృదయాలను వర్ణించిన ఒక గ్రంథం—నపేర్రా ఉత్కృష్టమైన మానవ జాతికొక అవయవమంటి ఈ అడవి జతులకుకూడా హృదయమున్నదని రూపించే చిత్రం నపేరా!

జహూర్ అనే ఒక నాయకుడు పాముల విషాన్ని తనలోనికి పోవచేసుకొని, దానిని మంత్ర శక్తిచేత హరించుకొని, యోగసిద్ధి పొందడానికి ప్రయత్నిస్తుండగా అతనికొక సర్పదష్టమైన బాలిక కనిపిస్తుంది. అతడు ఆమెను రక్షించాడు. కాని అతని ఉపాసన సిద్ధించాలంటే బ్రహ్మచర్య దీక్ష అతనికి

అవ్వసరం. అందుచేత అతడు ఆ పిల్లకు మగవేషం వేసి చందన్ అను పేరుపెట్టి తన యింటనే వుంచుకున్నాడు. ఆ రహస్యము అతనికే తెలుసు. అతడు పూజించే మనసాదేవికే తెలుసు. అప్పటినుంచి అతని యోగసిద్ధి పతనమై పోతున్నదనే సంగతి అతనికి తెలియదు - మనసాదేవికే తెలుసు. ఒక సారి స్త్రీ సౌందర్యాన్ని విలోకించి అతడు చకితుడైనాడు! ఆనాడే అతని సిద్ధి అధోముఖమైనది. భగవంతుని పరంగా నిష్కామ కర్మ లిప్సతో ప్రయత్నించే యోగపద్ధతికి పతనముండదు. కాని ఒక వ్యక్తి ఒక స్థానాన్ని, శక్తినీ కోరి చేసిన సాధనకు పతనం తప్పదు. అదే యిందులోని పరమార్థం. యోగ సిద్ధిలో అతడు నెగ్గలేక పోయాడు. తిరిగి సామాన్య మానవ ధర్మాల్ని గ్రహించి, ప్రేమ సామ్రాజ్యానికి పట్టభద్రుడూ కాలేక పోయాడు. చందన్‌ను మగవాడుగా గ్రహించి మాటుశ్రీ అనేకన్య వరించింది. చందన్ నిజవృత్తాంత మెరిగి జుమ్రూ అనే సుందరుడొకడు ఆమెను వరించాడు. వీరిద్దరి ప్రేమ జహర్‌కు తెలియకుండానే అల్లిబిల్లిగా అల్లుకొని లతలు మొగ్గలు తొడిగింది. ఒకనాడు జమ్రూ నాయకుడైన జహర్‌కుతన ప్రేమవృత్తాంతం చెప్పాడు. కాని జహర్ చందన్‌కిదివరకే పెళ్లి అయిందని చెప్పాడు, ఆ నిరాశతో - వెళ్లాడతడు.

చందన్ మగవాడు కాదు ఆడది - జహర్ ఆమెను ప్రేమిస్తున్నాడనే వార్త గ్రామంమంతటా ప్రాకింది. అది విని జహర్ తను ప్రేమించడంలేదని వాగ్దానం చేశాడు. జమ్రూకా వృత్తాంతం తెలిసి తిరిగి వచ్చి చందన్‌ను తీసుకొని పారిపోయాడు. జహర్ దీనిని సహించగలడా!

ఒక ప్రక్క అతని యోగసిద్ధి పూర్తి కానున్న సమయం! ఒక ప్రక్క తన జీవితానికి వెలుగు తెస్తుందని ఆశపడి దాచికొన్న స్త్రీరత్నం మరొకళ్లదై పోతున్నదనే విషాదం-అతడు యోగాన్నే త్యజించి పగసాధించుకో తలుచుకున్నాడు. నల్ల త్రాచును మంత్రించి వదిలాడు.

చందన్ ప్రియుడివియోగం సహించలేదు. - అతని క్షేమమే ఆమెకు ప్రాణం, అతడులేని ప్రపంచమంతా శూన్యం అతనికోసం! తన్నయినా అర్పించుకో కలిగింది. ఆ స్వార్థరాహిత్యాన్ని, ప్రేమ బలాన్ని సిద్ధభావాన్ని చూచి జహర్ తన క్రోవను షళ్ళించుకోకలిగాడు. వారికి అడ్డంరాకుండా తనేతొలగి ప్రాణాల్ని అర్పించాడు. అదే అతని చరమసేవ; అదే అతనికి ముక్తి.

# ఉగాది కానుక

## శ్రీ మన్మథోత్సవము

శ్రీ కల్లూరు అహోబలరావు



సీ॥ తియ్యని చెఱకుఁ గుదించి, వింటినిఁజేసి
తేఁటినారినిఁ గట్టి మీటినావు
మేలిరంగుల, తీపి పూల, శృంగారమా
బాణంబు నీచేత బట్టినావు
చిగురుటాకుల మెక్కి గగనానఁ బాఱు, రా
చిల్కఁబట్టి సవారిఁ జేసినావు
శుకపిక శారికా నికరంబుఁగొని, వసం
తుఁడు రాఁ బ్రమోదంబుఁ బడసినావు

గీ॥ అల్ల, మధుమాస మేతెంచె; హాయిఁ గొనఁగ
రమ్ము రారమ్ము! మన్మథా! రతియుఁగూడ
నీదు రాకను గోరె; నుగాది నేడు
పండుగ శుభంబు మాతోడఁ బంచుకొమ్ము.

సీ॥ నవబోడి యగు, వరూధినితోడ వీణను
వాయింపఁ జేసిన వాడెవండు?
సింగార రూపంబు పొంగార మేనక
నటియింపఁ జేసిన నటకుఁ డెవఁడు?
కోకిలవాణి, శకుంతల, దుష్యంతు
నకుఁ గూర్చినట్టి, ఘటికుఁ డెవండు?
గురుభార్య తార-చందురుని ప్రేమించి, మో
హింపగాఁ జేసిన హితుఁ డెవండు?

గీ॥ నవ, వసంత కాలమునకు నాథుఁడెవడు?
ముద్దు మురిపెంబులకు, మూలపురుషుఁ డెవడు?
లోకమును వృద్ధిఁజేయు వివేకి యెవఁడు?
మన్మథా! నీవుగాక భూమండలమున?

సీ॥ ఆంధ్రా ఎలెక్షన్ను లాలించియా ప్రశ్న
యగుచు నుత్తేజంబు లధికమాయె;
కమ్యూనిష్టులు, స్వాధికార పిపాస, ను
న్మత్తులై సీట్లకు నొత్తిగిలిరి
కాంగ్రెస్సు, సమైక్య ఘటనచే వారల
కుదిద్దియై నిలబడె నూర్జితముగ
గొప్పనాయకులెల్లఁ గొండలై యిరుగడ
వచ్చి, ప్రచారము లిచ్చఁజేసి

గీ॥ రహహా! నీ తపస్సెంతయో! యాంధ్రమాత!
శ్రీ మహాత్ముండు, ప్రేమ నాశీస్సు లొసఁగె:
జయము బొందెను; కాంగ్రెస్సు సాటిలేక
మన్మథా! నీకుసత్కీర్తి మహినిఁ గల్గె.

సీ॥ విజయ గర్వము జెంది, విఱ్ఱవీగుట కాదు
మెలకువఁ గనువిప్పి మెలఁగవలయుఁ
బ్రజకెల్ల ముఖ్యమా ప్రతినిధుల మాటన్న
భావ నిశ్చయమున, వఱలవలయు
నాంధ్రదేశాభ్యుదయ, కరంబులగు, కార్య
నిర్వహణముజేసి నెగడవలయు
అధికార పదవుల నంధులై మెలఁగుట
తప్పుకార్యంబని తలఁపవలయు

గీ॥ ఘనతఁజెందిన కాంగ్రెస్సు—మనకు లోటు
కల్గునా యంచు, మత్తత నీల్గఁజనదు;
ఖండ ఖండాంతరస్థు లక్కఱతో, కాంగ్రె
సును, స్తుతింపగా, మన్మథా! శుభము గొనుము!

సీ॥ భూపాల! బెజవాడ గోపాల! నీపాల
లోపాలు రాకుండ బాపుమయ్య!
నీలమా! నీలోని మేలిమి నిగనిగల్
సొంపుగాఁ బ్రజలకు జూపుమయ్య!
పదునారు కళలతోఁ బ్రభలీను శశికళా!
నీ చంద్రిక, జగాన నింపుమయ్య!
లచ్చన్న! ప్రజలకు మెచ్చన్నవై నీవు
హెచ్చు కీర్తిని, గడియింపుమయ్య!
కల్లూరి! పరమోపకారి! బిశారి! నీ
పరిపాలనము బాగు పఱచుమయ్య!
తెన్నేటి! చనలేటి తేట నీటినిగ్రోలి
తెలివి తేట లాకింత దెలుపుమయ్య!

గీ॥ శ్రీ ప్రకాశమ ! నీదగు సుప్రకాశ
మెల్లదిశలందుఁ బర్వ, సొంపెసఁగుమయ్య !
ఆంధ్ర రాష్ట్రాభివృద్ధికై యహరహంబు
పాటుబడుఁడయ్యలార ! ఈ వత్సరమున.

సీ॥ బహ్వారు ! నీ మేటి శక్తి సామర్థ్యంబు
మనుజమండలికెల్ల మార్గదర్శి
ధేబరు ! నీ కార్యదీక్ష, కాంగ్రెసువారి
గాఢ నిద్రకు, మేను కన్నువిప్పు
భావె ! వినోభ ! నీ పరమ పావనమైన
భూదాన యజ్ఞంబు మోక్షసిద్ధి
శ్రీ త్రివేది ! సుగుణశ్రీ ! నీదు పాలన
దక్షత, శ్రీరామరక్ష మాకు

గీ॥ దొడ్డమంత్రిగ బెజవాడ రెడ్డియాయె,
సాహసోపేతులైరి మా సచివులెల్ల
స్థాయిగాఁ బ్రభుత్వంబిక సాగునట్లు
మన్మథా ! దీవనల నిమ్ము మమతతోడ.

సీ॥ శాంతి భద్రతలంచు—సర్వదేశమ్ములు
హైడ్రజన్ బాంబు లాయత్తబఱచె
రాజ్యాధికారంబు పూజ్యంబుగాఁ గొనఁ
బార్టీలు విరివిగాఁ బ్రబలుచుండె
దుష్టశక్తులను, సంతోషంబు లుదయించె
విప్లవ రేఖలు విశదమయ్యె
ఆంధ్ర పౌరుష తేజ మభ్యుదయ మొనర్చి
రాష్ట్రి యశస్సు సంరక్షచేసి

గీ॥ తెలుఁగు కవులకుఁ గొంతకు దీప్తి నొసఁగి
తెలుఁగు వెలుఁగు జగాన, రాజిలఁగఁ జేసి
వెలయగలవారొక్కొ ? మన్మథా ! వేచి చూచి
చెప్పనున్నాము మాతీర్పు, చిత్తగింపు.

సీ॥ రాజు శుక్రుఁడు గాన రంజిల్లి వర్షముల్
సస్య సమృద్ధియౌ జగతియందు
మంత్రి గురుఁడు గాన మంత్రాంగమున యోగ్య
మంత్రులు లభియింత్రు మాన్యముగను
మాన్యుండు శుక్రుండు ధాన్యాధిపతియయ్యె
పూర్ణ ధాన్యంబులు బొలుపుఁగనును
పశునాయకుండు, గోపాల మహారాజు
పాడి పంటలు, లోటు పడకనుండు

గీ॥ ఆయురారోగ్య భాగ్యంబు లతిశయించి
విద్యయు, వినయభావంబు వెలయగల్గి
దైవ భక్తియు రక్తియుఁ దాండవించి
ప్రజలు సుఖియింత్రు మన్మథాబ్దమున సతము.

—o—





## రామ మునగకాయల ఊరగాయ

1 వీశ రామమునగకాయలు (పచ్చిటమాటోలు) శుభ్రముగా కడిగి తుడిచి చిన్న చిన్న ముక్కలుగా తరిగి జాడీలో యుంచుకొనవలెను. అందులో సోలెడు ఉప్పు, కాలుగిద్దెడు పసుపువేసి బాగ కలుపవలెను. ఈ మిశ్రమాన్ని రెండు మూడు రోజులు ఊరనిచ్చి అందులో పదిపలముల చింతపండు చిక్కని పులుసుపోసి కలియత్రొక్కి తోడుకొని అందులో అరసోలెడు కారపుపొడిపోసి కలిపి, అందులో పదిపలముల మంచినూనెలో ఆవాలు, మెంతులు, మిరపకాయలు చిటపట వేగునప్పుడు పోయవలెను కావలసినవారు ఇంగువపాలనుకూడ కలుపుకొనవచ్చును.

మంగళపల్లి వరలక్ష్మీదేవి

## పులింజి

ఇది మన అల్లపు పచ్చడిలాగుంటుంది. దీనిని కేరళదేశంలో విందులకు, పండుగలకు తప్పకుండా తయారు చేస్తారు.

పదిపలముల చింతపండును బాగా నానబెట్టి చిక్కని పులుసు తయారుచేసి యుంచుకోవాలి దానికి సరిపడ బెల్లం, ఉప్పువేసి కలుపుకొని కొంతసేపయిన తరవాత పచ్చని తెల్లని గుడ్డలో వడబొయ్యాలి. దానిలో కొంచము కారపుపొడి, చిన్నవి అల్లం, పచ్చిమిరపకాయ ముక్కలు, కొద్దిగా మిరియాలపొడి చేర్చి పొయిమీదపెట్టి బాగా తుకతుక ఉడకబెట్టాలి. అది బాగా కాగి నల్లని నేరేడుపండు రంగుకు రాగానే అంతమద్ద కాకమును పేదించి, సువాసనకొరకు కొద్దిగా మెంతిపొడినివేస్తే బాగుంటుంది. తరువాతకొబ్బరి నూనెలో కాసిని ఆవాలు, కరివేపాకువేసి పొయిమీదపెట్టి చిటపటమనిపించి పోపుపెట్టాలి. చల్లారిన తరువాత జాడీలో జాగ్రతగా నిల్వచేసికొని వాడుకోవాలి. ఇది నెల రోజులు చెడకుండా నిల్వయుంటుంది. దీని రుచి తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా చాల బాగుంటుంది.

యం. సుశీలాదేవి

---

''లూసీ! నేను ధనవంతుడనైనట్లయితే నీవు నన్ను తప్పక వివాహమాడేదానివి కదూ!''

''నీవు నన్నిలా పొగడుతున్నందుకు ధన్యవాదాలు''

''ఏమిటలా అంటున్నావు!''

''నీవు, యింకా అనేకులు నా అందచందాలను గుర్తించి విశేషంగా యింతకాలం పొగిడేవారు – యిప్పుడైనా మీలో ఒకరు నాలోని ప్రపంచ జ్ఞానాన్ని గుర్తించడం యిదే మొదటిసారి.''

'నారపీచు'



పడతి చేతిలోని పుష్పాలు

# మనసు మారింది!

శ్రీ కానాధి భొట్ల వెంకట సుబ్బారావు

"అబ్బ! కొట్టకండి! అయ్యో! చచ్చిపోతున్నా"

"చావు లమ్డికే - ఏదీ యిస్తావా యియ్యవా ?"

ఈ భాగవతం రోజూ జరుగుతూనేవుంది. ఆ రోజు కూడా మామూలే. భర్త కాంతారావు తప్పత్రాగి వచ్చాడు; ఒళ్లు తెలియని మైకంలో ఏవేవో అనరానిమాట లంటున్నాడు; వీపు చిటికేలా బాత్తున్నాడు. దెబ్బలు తినీ తినీ ఆమె శరీరం మొద్దుబారింది. ఇది రోజూ కాంతారావుకు వినోదంగా వుంది. సుగుణ మాత్రం దెబ్బలు భరించలేకపోతూంది. ఆమె పసిడి వన్నెల దేహం రోజూ అతని చేతుల్లో పిప్పి పిప్పి అవుతూండేది.

కాంతారావు తాలూకా ఆఫీసులో గుమాస్తా. ఆ వచ్చే ఎనభై రూపాయల్లో మూడు వంతులకు పయిగా త్రాగుడుకూ, చీట్ల పేకలకు ఖర్చుపెట్టేవాడు. అతని నిర్లక్ష్యమే హెడ్‌క్లర్కునుండి క్లర్కుకు దింపింది. సుగుణ అడిగీ అడిగీ విసిగిన తరువాత మిగిలిన మూడో నాలుగో ఆమె చేతిలో పెట్టేవాడు. ఆ యిల్లాలు మూడూ నాలుగు రూపాయలతో సంసారమెలా యీదుకొస్తుంది ? తనూ, తన భర్తా, పిల్లలూ బ్రతకాలిసివచ్చె! అలాగే పుట్టింటివారు పెట్టిన నగలన్నీ కరిగించి యింతవరకూ సంసారాన్ని యీదుకొచ్చింది. ఇంక ఏముంది తన మెడలో- తల్లిగారు పెట్టిన మూడు పేటల గొలుసూతప్ప ! అది కూడా యిమ్మని పట్టుపట్టేడు.

"ఊ ! తొందరగా ఇవ్వు - చేతిలో డబ్బులేక ప్రొద్దుటినుండీ త్రాగలేదు -" అంటున్నాడు భర్త.

"ఈ వేళకు త్రాగకపోతే ఏంపోయినదండీ ?" ఆ మాట అనటానికి ఆమెకంతధైర్య మెలావచ్చిందో!

చెంప చెళ్లుమంది - సుగుణ కండ్లునీళ్ళతో నిండిపోయినవి. మిసమిసలాడే ఆమె లేతబుగ్గలు ఎర్రగాపొంగి మాంసపు ముద్దవలె తయారయినై.

ఇక దెబ్బలు భరించలేకపోయింది - గొలుసు తీసి యిచ్చింది. కాంతారావ్ గొలుసు తీసుకుని వెళ్లి పోయాడు.

♦ ♦ ♦

ఉన్న కొద్ది అన్నంలో కొంత పిల్లలకుపెట్టి, కొంత భర్తకు వుంచింది-పాపం, సుగుణ కాలే కడుపుతో అలానే మంచంమీదికి ఒరిగింది.

ఆమెకు తన చిన్నతనపు భోగాలు ఒక్కొక్కటే ప్రత్యక్షమౌతున్నయ్. సుగుణ తాశిల్దారుగారమ్మాయి. చిన్నప్పటినుంచీ ఎంతో అల్లారుముద్దుగా పెరిగింది. కమ్మటి భోజనం; చక్కని దుస్తులు కట్టుకుని రిక్షాలో ప్రతిరోజూ స్కూలుకు వెళ్ళటం - తిరిగి రిక్షామీద యింటికి రావటం - ఇలాటి సుఖాలతో ఆమె బాల్యం గడిచిపోయింది.

స్కూలు ఫయినలు ప్యాసయింది - కాలేజీలో అడుగు పెట్టకముందే యీ సంబంధం కుదిరింది.

"అమ్మా ! ఆ అబ్బాయి బి. ఏ. ప్యాసయ్యాడు. తెలివికలవాడు, బుద్ధిమంతుడు ! ఇంతకంటే మంచి సంబంధం దొరకటం కష్టమమ్మా" అని తన తండ్రి అన్నప్పుడు తనెంత ఆనందపడింది ! ఎంతో సుఖపడతానని ఎన్నెన్నో కలలుకంది ! ఏదీ యిప్పుడు ఆ ఆనందమంతా ? ఆమె కోరికలన్నీ అడవిగాచిన వెన్నెలలైపోయినై. ఇవన్నీ ఆమె హృదయంలో ఒక్కొక్కటే మెదిలి మాయమైపోతున్నై. బాధగా ప్రక్కకు వత్తిగిలింది. కాని ఆమెకు నిద్ర పట్టలేదు. ఏవేవో ఆలోచనలతో బుర్రగిర్రున తిరుగుతుంది ! అటు చూస్తే భర్త త్రాగుబోతయ్యాడు. ఇటు పిల్లలు ఆకలితో అల్లల్లాడిపోతున్నారు. తనకు రెండు రోజులనుండీ ఒంటిపూట భోజనమే. తన బ్రతుకు యిప్పుడు మోడువారిన చెట్టయింది. ఎందుకొచ్చిన బ్రతుకిది ! హాయిగా ఎందులోనైనాపడి కళ్లు మూసుకుంటే పీడా వదలు

తుంది, అనుకుంది. ఆమెకు యిక జీవించాలని ఆశ లేదు - జీవితంమీద రోత పుట్టింది. ఇల్లంతా ప్రశాంతంగావుంది - ఆమె మంచంమీదనుండి లేచింది. దొడ్డి బావివైపు నడిచింది.

గభీమని చప్పుడవటంతో ప్రక్కయింటి వాళ్లంతా పరుగెత్తుకుంటూ నూతి దగ్గరకు వచ్చారు. వెంటనే ఒకడు గబగబా నూతిలోకి దిగి ఎంతో ప్రయాసతో బయటకు తీశాడు. కడుపులోని నీళ్లన్నీ బయట పడ్డాక ఆమెకు కొంచెం తెలివివచ్చింది.

"పాపం! పండంటి పిల్లను చేతులారా ఆ త్రాగుమోతుకు కట్టబెట్టారు-" అంది ఒకావిడ.

"అవునమ్మా! వచ్చిన జీతం త్రాగుడికీ, పేకకూ ఖర్చుపెట్టి యింట్లో చిల్లి కానీ యివ్వకపోతే ఏంచేస్తుందీ - ఆడది! ఎక్కడనుండి సంపాదించి కుటుంబమును పోషిస్తుంది? యీ బాధలన్నీ భరించలేక చావుకు సిద్ధపడింది" అంది ఒకావిడ గుడ్లనీరు గుక్కుకుంటూ.

"అందుకనేనమ్మా! ఆడపిల్లని ఒక అయ్య చేతిలో పెట్టేటప్పుడు ఒక చదువు విషయమేకాదు - బుద్ధి విషయంకూడా ఆలోచించాలి" అంది మరొకావిడ; యిక ముందు తన పిల్లల విషయంలో జాగ్రత్తపడా లన్నట్లు—

ఇలా ఎవరికి తోచినట్లువారు ఆమెను గురించి జాలి వెళ్ళబోశారు. నెమ్మదిగా యింట్లోకిచేర్చి ఒక మంచంమీద పడుకోపెట్టారు. ఆమెకు స్పృహ వచ్చింది; కళ్లువిప్పి చూచింది. ఒకామెవచ్చి ఆమె తలమీద తగిలిన దెబ్బలకు మందుపూసి కట్టుకట్టింది. కొంత సేపయిన తర్వాత నెమ్మదిగా లేచి కూర్చుంది.

"నన్నెందుకు బ్రతికించారు బాబూ! ఇంకా ఎంతకాలం కష్టాలనుభవించాల" అంది సుగుణ.

"పిచ్చిపిల్లా! చచ్చి ఏం సాధిస్తావమ్మా! ఇదుగో యిటుచూడు నీ పిల్లల్ని-నీవు బ్రతకాల్సింది కేవలం నీ భర్తను గురించికాదమ్మా! ముఖ్యంగా నీ పిల్లల పురోభివృద్ధిని గురించయినా నీవు బ్రతకాలి తల్లీ! నీవు లేకపోతే నీ పిల్లలగతి ఏమవుతుందో ఆలోచించుకో" అన్నాడు ఒక ముసలాయన.

ఇంతలో గందరగోళానికి పిల్లలు లేచారు. తల్లి ప్రక్కలోలేదు. అటూ యిటూ చూచి గబగబా పరుగెత్తుకుంటూవచ్చి తల్లివడిలోవ్రాలి "అమ్మ యిక్కడున్నావేమమ్మా! వీళ్లంతా ఎందుకిక్కడున్నారు" అన్నారు అమాయకంగా.

ఆమె హృదయంలో మాతృత్వం పెల్లుబికింది. బిడ్డల్ని తన హృదయానికి హత్తుకుంది.

ఇంతలో కాంతారావు తూలుకుంటూ యింట్లోకి వచ్చాడు.

"ఏమయ్యా! నీకు బుద్ధిలేదూ! పండంటి పిల్లను అష్టకష్టాలు పెడుతున్నావే?" అన్నాడొకాయన.

"నిముషంలో తప్పిపోయింది; లేకపోతే నీగతీ, నీ పిల్లలగతీ ఏమయ్యేదో!" అన్నాడు మునుపటి ముసలాయన.

"పదండి పోలీసులకు పట్టిద్దాం త్రాగుమోతును;" అన్నాడొకడు ముందుకువస్తూ.

సుగుణ గబగబావచ్చి అతన్ని వారించి "అయ్యేమీ అనకండి యిదంతా నా ఖర్మ" అంది.

పిచ్చి పిల్ల! అనుకుంటూ వాళ్ళువెళ్లిపోయారు. కాంతారావుకు మైకంలో స్పష్టంగా ఈ మాటలు వినిపించక పోయినా ఎందుకనో యీ మాటలు అతని హృదయాన్ని కలచివేయసాగినై. గదిలోకివెళ్లిమంచం మీద పడుకున్నాడు. తప్పత్రాగి వచ్చిన మైకంలో ఏవేవో గొణుగుతున్నాడు. క్రమంగా అతనికి నిద్ర పట్టింది. అర్ధరాత్రి అయ్యేసరికి అతనికి మెలుకువచ్చింది. మత్తువదిలింది. కళ్లు విప్పిచూచాడు. ఎదుట ఏదో అస్పష్ట ఆకారం అగుపించింది.

"నీవు మనిషివేనా? నీకు హృదయంలేదూ! భార్యనలా కష్టాలపాలుచేస్తున్నావే? నీ వల్ల సుఖపడదామని ఎన్నో ఆశలు, ఎన్నోకలలూ కందే? అమాయకురాల్ని చేసి ఏడిపిస్తున్నావే!

ఆమె ఆశలనన్నీ అడవిగాచిన వెన్నెల చేయడమే కాకుండా నిర్దాక్షిణ్యంగా హింసిస్తున్నావే! పెద్ద చదువుకున్నావే - యివేనటయ్యా నీకు నేర్పింది? నీమాదిరిగా తప్పత్రాగి నీబావమరిది నీ చెల్లెల్ని కొడుతూంటే నీహృదయం సహిస్తుందా? నీ తలిదండ్రులు చూస్తూ వూరుకుంటారా? ఇష్టంవచ్చినంత వరకూ ఆడించి తరువాత పారెయ్యటానికి ఆటబొమ్మ అనుకున్నావటయ్యా. నిన్ను చేసుకొని ఆ అమ్మాయి సుఖంపడిందేమిటీ? తిట్లూ, శాపనార్థలూ దెబ్బలు తప్ప-పిల్లల అదృష్టం బాగుండబట్టి నలుగురూవచ్చి ఆమెను బ్రతికించారు — లేకపోతే నీపిల్లల గతి ఏమయ్యేది? నీగతి ఏమయ్యేది?"

ఆ అస్పష్ట ఆకారం గుండెల్ని దూసుకుపోయేటట్లుగా ఎత్తిపొడిచింది.

అతనిలో ఏదోమార్పు కలిగింది. అప్రయత్నంగా జలజలా భాష్పకణాలు రాలినై.

కాంతారావ్ మంచంమీదనుండి లేచాడు. సుగుణ దగ్గరకు బయలుదేరాడు. ఆమెప్రక్కనే పసివాళ్లు అమాయికంగా నిద్రిస్తున్నారు.

"అమ్మ ఏమి అపచారంచేసిందని యిలా వేధిస్తున్నావు నాన్నా!" అని పసివాళ్లు అతనివైపు జాలిగా చూచినట్లగుపించింది.

"నేనేంచేశానని నన్నిలా కష్టపెడుతున్నారండీ!" అని భార్య అతనివైపు జాలిగా చూసినట్లగుపించింది.

అమాయకంగా నిద్రిస్తుంది ఆమె. కళ్లనీళ్లు ఆమె బుగ్గలమీద చారలు కట్టినై. ఆమె బోసిమెడ హేళన చేసినట్లున్నది అతని కళ్లనుండి భాష్పధారలు వరదలై పారినై.

"సుగుణా!" అన్నాడు ఆమెమీద చెయ్యివేసి. సుగుణ వులిక్కిపడి కళ్లువిప్పింది.

"క్షమించు సుగుణా!" అన్నాడు భర్త.

ఆమె కళ్లల్లోనుండి ఆనందభాష్పాలు తొంగిచూచి, మంచందిగింది; భర్త పాదాలవద్ద కూర్చుంది.

"నేను నీకుచేసిన అపచారాలు మన్నించు సుగుణా! పిల్లలమీద ఒట్టువేసి చెబుతున్నా — ఇక ఎన్నడూ అటువంటి దురభ్యాసాలకు లోబడను; ఎన్నటికీ మిమ్మల్ని కష్టపెట్టను. క్షమించు." అని ఆమె పాదాలను స్పృశించబోయాడు.

ఆమె వెంటనే ప్రక్కకుతప్పుకుంది.:

"ఛా! అలా కళ్లనీళ్లు పెట్టుకుంటారేం! ఈనాటికైనా నా అదృష్టం పండింది. అంతేచాలు. పిల్లలూ, నేనూ అదృష్టవంతులం. లెండి!" అంది సుగుణ.

అతనికళ్లనుండి అమృతం కురిసింది; ఆమెకళ్ల నుండి ఆనంద భాష్పాలు తొంగిచూచినై.

క్రొత్తగా కాపురంపెట్టిన తర్వాత ఆమె తృప్తిగా భర్తతో కలిసి భోజనంచేసింది ఆ నాడే.



# ఆగంతకులు

శ్రీమతి వే. వినత

---

చంద్రశేఖరం:-ఒరే, అబ్బాయి మోహన్! రేపు ప్రొద్దు 9 గం.లబండీకి అక్కా-బావా వస్తున్నట్లు ఉత్తరంవచ్చింది. స్టేషనుకు వెళ్ళి తీసుకురావాలి, మరినేను వెడదామంటే తీరుబడిలేదు. 7½ కల్లా ఆఫీసులో హాజరుకావాలి. కాకపోతే మా ఆఫీసరుచేత మంగళ హారతులు.

మోహన్:-సరే అట్లాగే వెడతా నాన్నా! కానీ.....

చం:-కానీ...యేమిటి?

మో:-ఏమీలేదునాన్నా. నాకు ఊహ తెలిసింతరువాత ఎప్పుడూ అక్కనీ, బావనీ చూడలేదుకదా-ఎట్లాగా అని....

చం:-ఓస్. అదాసంగతి. బావపేరు తెలుసుకద! అక్కయ్య మీ అమ్మకుమల్లేనే సన్నగా పొడుగ్గా వుంటుంది. రంగు చామనచాయ. ఒకవేళ నీవు గుర్తించకపోయినా, వసుంధరేనిన్ను గుర్తిస్తుంది-ఏమంటావు?...

మోహన్ చిన్నతనంలోనే వసుంధరకు పెళ్లయింది. కాని మామగారికీ అల్లుడికీ యేవో కొద్ది మనస్పర్థలు వచ్చి, 'ఇంక మీ అమ్మాయిని పుట్టింటికి పంప'నని గట్టిగా చెప్పేశాడు అల్లుడు. తిరిగి పదేళ్ల అనంతరం ఇప్పుడు రాక.

మరునటి రోజు ప్రొద్దున -

మో:-అమ్మా? నేను యివాళ తలంటి పోసుకుంటానే-

తల్లి:-ఆ, ఎంతమాట! (తనలో ఎప్పుడూ నేను ఎంత బ్రతిమాలుకున్నా రాని వాడికి ఇవాళ ఇదేంబుద్ధట) తప్పకుండా పోసుకో ఇంతకంటె యింకేంకావాలి!

మో:-అది కాదే మరి అక్కయ్యవస్తోంది కదూ అందుకని.

మోహన్ తలంటి పోసుకొని కొత్త బట్టలేసుకుని హడావిడిగా 7¼ గం.లకే స్టేషకు వెళ్లాడు.

(మోహన్ తనలో)'వెధవది టైము దబ్బునవుతే బాగుండును' అనుకుంటూ పక్కనేవున్న హోటలుకు వెళ్లి ఇడ్లెన్లు కాఫీ తీసుకుని హిగిన్ బాదమ్స్ పుస్తకశాలకు వెళ్లి, చందమామ, కినిమా కొని పావు గంటలో చదివేశాడు. వాస్తవానికి ఇవి చదవటానికి చాలా టైంమ్ పట్టినా, ఇప్పుడు మాత్రం చాలా త్వరగా చదివేశాడు. ఇంక ట్రైన్ రావడానికి పదినిమిషాలు వున్నది. యీలోపల ఎంక్వైరీ ఆఫీసుకు వెళ్లికనుకున్నాడు ట్రైన్ ఎన్నిగంటలకు వస్తుందని. అక్కడ ఆఫీసరు పదినిమిషాలు లేటని చెప్పింది. మోహన్ విని 'తస్సాదియ్యా'అనుకుని చదివినవే తిరిగి తిరగేస్తూ

కూర్చున్నాడు. రైలువచ్చింది. స్టేషను నిశ్శబ్దంగా వున్నదల్లా ఒక నిమిషంలో గందరగోళమైపోయింది. కూలీ, కూలీ అంటూ రైలు చుట్టూ మూగారు. అప్పుడే రైలు పెట్టెలోంచి దిగుతున్న దంపతులను చూచి నాన్న చెప్పిన పోలిక గుర్తించి "ఆ .. మీ పేరేమిటండి?"

ఆయన:-నా పేరా! సుబ్రహ్మణ్యం. నీపేరేమిటబ్బాయి?

మో:-నా పేరా! మీకు తెలియదూ!- మోహన్. ఇదివరకు నేనెప్పుడూ చూడలేదు. ఇదే చూడటం అక్కయ్యా! మిమ్మల్ని.

ఆవిడ -సరేకానీ, మాకూ యీవూరు ఇదే క్రొత్త - ఎట్లాగా అనుకుంటూ వుంటే నీవు కనపడ్డావు. చాలా సంతోషము తమ్ముడూ!

ఆయన:-మీరు ఎక్కడవుంటున్నారు?

మో:-మేము నారాయణపేటలో వుంటున్నామిప్పుడు. పాతఇంట్లోంచి మారి వారం రోజులైంది.

ఆ:-హోటలు ఎక్కడవుంది? భోంచేసి వెడదాం.

మో:-వద్దండీ-ఇంటిదగ్గర చేయవచ్చుగా- టాక్సీని పిలుస్తారండి.

అంతా ఇంటికి వచ్చారు.

తల్లిరాకరాక అల్లుడువచ్చాడన్న సంతోషంతో వాకిట్లోకి చెంబుతో నీళ్లు తీసుకువచ్చి ఆశ్చర్యపోయింది. చాటుగా అబ్బాయినిపిలిచి, వీళ్లెవరురా మోహన్? అక్కయ్యావాళ్లుయేరి?

మో:-తెల్లపోయి. అమ్మా! ఆవిడ అక్కయ్యకాదూ! . ఆయనపేరడిగితే సుబ్రహ్మణ్యం అని చెప్పారే - ఆవిడిని అక్కయ్యా అంటే తమ్ముడూ అని పిలిచిందే!

తల్లి:-సరేకానీ, అఘోరించావులే. వాళ్లను వచ్చి స్నానం చేయమని చెప్పు.

[ఆయన లోపలకు వస్తూ,]

"నమస్కారమండీ. మేము యాత్రలకని బయలుదేరి ఒక్కొక్క వూరే చూసుకొంటు వస్తున్నాము. ఈ ఊరు మాకుక్రొత్త ఇదే రావటం. ఎట్లాగా అనుకుంటూవుంటే మోహన్ కనిపించాడు. నిజంగా... తమ్ముడుకంటే ఎక్కువగా ఆప్తుడైనాడు- భోజనం చేసి వెడదామంటే ఇంటికివచ్చి చేయవచ్చునని తీసుకువచ్చాడు.

తల్లి:-ఈ రైల్లోనే, అమ్మాయీ, అల్లుడూ వస్తామని వ్రాశారు. వాళ్లనాన్నగారికి తీరుబడిలేక అబ్బాయిని స్టేషనుకు పంపారు. అమ్మాయి అచ్చం మా అమ్మాయిలాగానేవుంది. మోహన్ పొరపడ్డాడు' అంది. ఇంతలో చంద్రశేఖరంగారు వచ్చారు. జరిగిన సంగతంతావిని నవ్వుకున్నారు మోహన్

చేసినపనికి.

అల్లుడి హోదాలో, పిండివంటలతో కమ్మగా భోజనంచేసి ఆదంపతులిద్దరూ వాత్సల్యంతో ''వెళ్ళొస్తాం... మీరుచేసిన సత్కారానికి మేమెంతో కృతజ్ఞులం, మీ మేలు ఎన్నటికీ మరువరానిది'' అంటూ లేచారు. పోస్టుమాన్ పోస్టు అంటూ ఉత్తరం పడేశాడు.

చంద్రశేఖరంగారు వుత్తరం పైకి చదువుతారు. ఆదుర్దాగా.....

శ్రీ మామగారికి,

నమస్కారములు. నిన్న బయలుదేరుదామని ఉత్తరము వ్రాశాము, కాని మా ఆఫీసరు హఠాత్కరణమువల్ల రాలేక పోయినాను. వారం పదిరోజులలో సెలవు చూచుకొని వస్తాం. మోహన్‌ని అడిగి నానని చెప్పండి!

భవదీయుడు

సుబ్రహ్మణ్యం

ఆ, ఆగంతకులు సుష్టుగా భోంచేసి వచ్చిందారినే తిరిగివెళ్ళారు –

చం:–అసలు ఇంతకీ వాళ్లకు ఎప్పుడో మనము ఋణపడివున్నాము (అంటూ నిట్టూర్చారు.)



# కథలు - కాలము

**శ్రీమతి యం. లక్ష్మీదేవి**

---

కథలనగా ఆ బాల వృద్ధమునకును ఆసక్తిమెండు. అట్లు మనస్సును, ఉత్సాహమును హరించుకొనుశక్తి కథలకెట్లు గలిగినది? అసలు కథనగా ఆరంభము మొదలు తుదివరకు పేర్కొనబడు జీవిత చరిత్ర. అది నిజమైనవే కావచ్చును: లేక కల్పనీయములే కావచ్చును; మానవ జీవిత సంగ్రహాలే కావచ్చును; లేక వన్యమృగములు, వనదేవతలు, వస్తు సముదాయమునకు సంబంధించినదే కావచ్చును. ఏదైనను జనసముదాయమునకు కథలలో రుచి, స్వారస్యము అధికము.

ఇంక కథలలో పురాణ కథలు, నీతికథలు, సామాజికకథలు, పిట్టకథలు, కట్టుకథలు, హాస్యకథలు మున్నగునవికలవు. వీట్లలో కొన్ని ఉద్దేశ సహిత ములుగాను, కొన్ని ఉద్దేశ రహితములుగా కేవలము ప్రొద్దుపోవుటకొరకు ఉపయోగించబడుచున్నవి.

పురాణకథలు:— వేదకాలపు ఋషీశ్వరులయొక్క కథలును, రామాయణ, భారత, భాగవతాది ఇతిహాస కాలపు కథలును, పురాణ కథలుగా చెప్పబడుచున్నవి. పూర్వమందు ప్రజలు తఱచుగా దేవాలయములందును, మఠములందును, పురాణకథా కాలక్షేపము చేయుచుండెడువారు. ఈ కథా శ్రవణము మూలమున వారు స్థిరవైరాగ్యము, భక్తి, నియమము, నిష్ఠలను ఆధ్యాత్మిక సంపత్తిని చేకూర్చుభావములను ఉద్దేశించి మనస్సును పొనిచ్చెడువారు. ఈ హరికథా కాలక్షేపములు వారి ఆత్మిక శక్తియొక్క వికాసమునకు సహాయకారిగా ఉండినవి.

తరువాత రానురాను ఆత్మికశక్తిని గడించుకొను ప్రసక్తి తగ్గిపోగా ఆ కథలనుండి వ్యవహారిక జ్ఞాన సంపాదనకై నీతులను మాత్రమే గ్రహించుచు వచ్చిరి. అప్పుడు ఆ వేదకాలపు ఋషీశ్వరులయొక్క ఆత్మ సంబంధమైన సూక్ష్మ ఆదర్శములను అవగాహనము చేసికొను శక్తిచాలక ఆ కథలనువీడి రామాయణాది గ్రంథములనుండి నీతిని మాత్రమే గ్రహించుచు వచ్చిరి.

ఈ విధముగా ఈ కథలు అప్పటి జనసామాన్యము యొక్క నడవడికలకు నీతిప్రదాయినులై విలసిల్లెను. ఈ నీతి కథలయొక్క మార్గదర్శకత్వముక్రింద జనసంఘములు ఏర్పడి నియమములు, కట్టుబాట్లు ఏర్పరుపబడినవి. జనసమూహములో నొక సామాన్యవిధి యేర్పడి ఆ విధికి ప్రతి వ్యక్తియు కట్టుబడిపోవలసిన పరిస్థితులేర్పడినవి.

కొన్నాళ్ళవరకు ఈ నీతికథల ఆధారముచేతనే జనసముదాయమున నొక విధమైన శాంతియుత జీవితము ఏర్పడెను. ఈ కాలమునందే మనకు అనేకులైన రాజులు, మహారాజులు మొదలగువారి నీతియుతమైన ప్రజాపరిపాలన, వారి ధీరవీర పరాక్రమములు,మున్నగు వాట్లను గురించియున్న కథలు దొరికినవి.

క్రమముగా సాగుచున్న ఈ ప్రజాసముదాయములో స్వార్థపరులు బయలుదేరిరి. వారు బలవంతులై తమ స్వార్థము కొఱకు శాస్త్రమును, మతము, సంఘాచారము అను పేరిట బలహీనులను నానా హింసలు పెట్టదొడగిరి. అప్పటికి మనుష్యుల హృదయములలో ఆత్మశక్తి, నీతి ప్రాధాన్యత తగ్గిపోయి మమత్వ మహంకారాదులు పేరుకొనిపోయినవి. దురాచారులు ఎక్కువైరి. అసహాయులు బాధపడిరి. అప్పుడు సంఘములో తిరుగుబాట్లు, కలహములు బయలుదేరి సంఘసంస్కరణార్థమై సాంఘిక కథలు వెలువడెను.

అప్పటినుండి సాంఘిక కథలు ప్రజల మనస్సును కొంతవరకు ప్రకాశింపజేసెను. అప్పటికి ముద్రణా యంత్రసాధనములు తయారై యుండుటవలన పత్రికల ద్వారా, నవలలద్వారా, ఈ కథలు అతి త్వరితముగా ప్రజా సామాన్యమునందు తమ ఆధిక్యమును స్థిరపర్చుకొనెను. ఈ కాలమునందే ప్రప్రథమమున బంగాళములో బంకిమచంద్రుని నేవాపదనమును, అరవభాషలో ప్రతాప మదలియార్ చరిత్రయును వెలువడెను. ఇప్పుడు సాధారణముగా ప్రబలములై యున్నవి ఈ సామాజిక కథలే.

ఇక ప్రొద్దుపోవుటకొరకు వేడుక కథలు, ప్రయాణకథలు, హాస్యకథలు, మున్నగునవికలవు. వేడుక కథలుగా భట్టి విక్రమార్కుల కథలు, మదన కామరాజుకథలు - వీట్లను పేర్కొనవచ్చును. ఇక ప్రయాణకథలుగా కాశీ రామేశ్వర మజిలీలకథలు మున్నగువానిని చెప్పవచ్చును. ఇక హాస్యకథలుగా తెనాలిరామలింగనికథలు, అక్బరు వీరబలుని కథలు మొదలగువానిని చెప్పవచ్చును. ఇట్లే ప్రొద్దుపోకలకు పిల్లల కథలుగా పిట్టకథలు, పొడుపుకథలు, వన దేవతల కథలు, మొదలగువానిని చెప్పుకొనవచ్చును.

మొత్తముమీద ప్రపంచమునకు కథ యాధారముగా నున్నది. అందుచేతనే కథలకంత మహిమ కలిగినది.

ప్రస్తుత పరిస్థితులలో దేశములో గౌరవ మర్యాదలు తగ్గిపోవుచున్నవి. పెద్దలయందు పిన్నలకు భయ భక్తులు, వినయ విధేయతలు లేవు. తండ్రియందు పుత్రునికి, గురువునందు శిష్యునికి నమ్రభావములేదు. ప్రతి వ్యక్తియు తనకు తానే యధికారిగా ప్రవర్తించుచున్నాడు. ఈ భావములిట్లే వృద్ధిపొందుచున్నయెడల దేశము యధఃపతనము పాలౌను. ఇప్పటి పరిస్థితుల ననుసరించి ఈ సామాజిక కథలలో నొకి మార్పును కలిగించిన బాగుండునని నా యభిప్రాయము. అదేమనగా పురాణ కథలనుండి భక్తి, త్యాగము, గౌరవ మర్యాదలు మున్నగువానిని బోధించు కథలను ప్రస్తుత కాల దేశ వర్తమానముల ననుసరించి ప్రజాసామాన్యమునకు అభిరుచి కలుగు విధముగా కథా రచయితలు కథలను వెలువరింపజేసి మన ప్రాచీన హైందవ ధర్మమును, జాతీయతను, శ్రేష్ఠమైన హిందూదేశ గౌరవమును నిలబెట్టుదురని ఆశించుచున్నాను.



# పవనసందేశము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ



(ఫిబ్రవరి సంచిక తరువాయి)

అంగనలు సహింపర యి - భంగిని బ్రియతముఁడు సేయఁబొల్పడెనేని౯
నంగజు తూపులు నెదదూ - యంగ బ్రతుకనౌనె అక్కటా! యేమందు౯.

అలమధురాపుర సౌధం - బులలో విచారించు సొగసు పూబోండ్లపయి౯
జెలఁగెడి మోహంబెదలోఁ - గలుగునె నిను భక్తి నెన్ను కాంతామణిపై.

పట్టణ వాసుల నేరుపు - లెట్టుల మాకబ్బు; వారలేక్రియనైన౯
బట్టుదురు ప్రియుల చిత్తము - బుట్టను బెట్టుదురు నిన్ను బోటులనైన౯.

పొందిక మాటల చేతను - కుందనమున మణులనేర్చి కూర్చినయటు నీ
డెందము గరుఁగఁగఁ జేతురు - సందియ మొక్కింత లేదు చారుగుణాఢ్యా!

కమ్మ నినీవచనమ్ముల - నమ్మితి; సరివారిలోన నగుబాటయ్యె౯
వమ్మయ్యె జీవితము నీ - సొమ్ము; కపట నటన; జార చోర కృష్ణా!

నంద కుమారక! తావక - సుందర వదనారవింద సురుచిరరోచుల్
డెందమునఁబాయవెప్పుడు - సందేహము లేదు; నీదు సాక్షిగ కృష్ణా!

రేలుం బవళులు నొకటిగఁ - గాలము బుచ్చెదను జూడు కన్నులనశ్రుల్
రాలగ; దయరాదేటికిఁ! - గాలమె విధివిధానకలనయొ స్వామి.

కృష్ణ కృష్ణా యటంచు నా హృదయ వీధి - దలఁచి కను మూసికొన్నంత వలపుఁజిలుక,
గమ్మ కస్తూరి తిలకంబు చెమ్మగిల్ల - వచ్చి పరిరంభ సౌఖ్యమ్ము నిచ్చి పొమ్ము.

మరచితే; తొలుతటి నేస్తం - బరమరికలు లేని కూర్మిన ననఁగి పెనఁగియా
కరణి నొనర్చుట తగునే - భరియింతురె సతులు భంగపాటద కృష్ణా!

గోరంట పొదల మాటు నొ - యారంబుగఁ బొంచి యుండి యటు నేఁజనుచో
ధీరత వేణి నొడిసి కడు - గారవమున విరులు దురిమి కారింపవకో.

మందార మంజుల మాలతీవల్లుల – పొదల మాటునఁ బ్రొద్దుపుచ్చునాఁడు
బృందావనస్థిత సుందర తరులతా – మందిరంబులఁగూర్మి మసలునాఁడు
యమునా నదీతీర కమనీయసైకత – స్థలుల కేళీకేలఁ జెలఁగునాఁడు
శరదిందు కాంతుల నరుదార పచ్చిక – బయళుల కవగూడి పరఁగునాఁడు

మైమఱచి నీదు ప్రణయ సామ్రాజ్యమునకు – నేనశాశ్వత రమనంము నెంచి కొంటి
గగన సౌధంబులవి యెల్ల గాలిలోన – గలసిపోయెను గద నేటికాలమునకు.

కరమునఁ గరమిడి నాతోఁ – దరుణీ! నిను బాయనెట్టితతి నంటివి; నే
నెఱుఁగను; పృథ్వి నదిపులు – వరసూత్న ప్రియులటంచు వంచక కృష్ణా!

# స్వార్థమెరుగని త్యాగం

శ్రీ సి. సి. పున్నయ్య

---

అప్పటి వరకు ఆడుతూ పాడుతూ అల్లారు ముద్దుగానున్న రాకుమారుడు ఆకస్మికంగా స్పృహ తప్పిపోవడం రాజుకేకాదు యావత్ప్రజానీకానికి కలవరపాటుకు కారణమయింది. కారణమేమయి యుంటుందా అని రాజు, రాణి, మంత్రులు, సామంతులు ఆదుర్దాపడసాగారు. వైద్యులు పరిశీలించి రాజకుమారుని కేర్పడిన ప్రమాదకర పరిస్థితికి కారణం తెలియక తబ్బిబ్బగుచున్నారు. దైవజ్ఞులు, రాజపురోహితులు కలతబారిన హృదయాలతో అదేదో తప్పక భగవన్మాయయని పేర్కొనజొచ్చారు. రాజు, రాణి వేయిదేవుళ్లకు మ్రొక్కసాగారు. తాము చేసిన అపరాధములను క్షమించి తమ కుమారుని రక్షించమని పదే పదే ప్రార్థనలు సలిపారు. కాని రాజకుమారుని పరిస్థితిలో మార్పు రాలేదు. క్షణక్షణానికి నీరసచ్ఛాయలు స్ఫుటంగా గోచరించసాగినవి. రాజకుమారుని ప్రక్కన ఒక పన్నెండేండ్ల బాలుడు మోకాళ్లపై నిలుచుండి అర్థనిమీలిత నేత్రాలతో ధ్యానసముద్రంలో నున్నాడు. బహుశ రాజకుమారుని రక్షించమని భగవంతుని ప్రార్థిస్తుండాలి!

వయోవృద్ధుడు - అంధుడు, చిన్న పూరి గుడిశలో తన కుమారునితో తలదాచుకుంటున్నాడు. తన్మయత్వంతో భగవన్నామ సంకీర్తనంచేస్తూ ఆ పట్టణ వీధుల్లో కుమారుని వెంటబెట్టుకొని తిరిగేవాడు. అతని గాన మాధుర్యానికి మానవులేకాదు, దేవతలు సయితం, తన్మయులయ్యేవారు. అతడు భగవంతునితప్ప యితరులను కీర్తించడు; యితరులు పాడమంటే పాడడు. డబ్బు సంపాదించి నిల్వ చేయాలనే ఆశలేదు. అతని గానము భగవంతునుద్దేశించి - భగవంతుని గురించి-భగవంతుని కొరకు. మానవులకని యుద్దేశించిందికాదు. తాను పాడుతూ తిరుగుతుండే నగర వీధుల్లో ప్రజలు తండోప తండాలుగా గుమిగూడేవారు. కాని అతని గానామృతము బయటివారి అదుపాజ్ఞలకు లొంగేదికాదు. ఒకరు పాడమంటే పాడడు, పాడుతుంటే యితరులాపమంటే ఆపడు. ఆలయంలో భగవత్సాన్నిధ్యంలో అమృత గానాన్ని వర్షిస్తుంటే అతనితోబాటు గుమికూడినవారు సయితం బాహ్య ప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయేవారు. అబ్బ,కొడుకులకు కూటికి గుడ్డకు కరువులేకుండా జరిగిపోతున్నది.

ఒక రోజున ఆ వృద్ధుడు కుక్కి మంచంలో పండుకొని యున్నాడు. కొడుకు పరుగెత్తుకొనివెళ్లి "నాన్నా! మనం యిలా శాశ్వతంగా బిచ్చగాళ్లంగా నుండాల్సిందేనా" అడిగాడు ఏదో ఆవేదనతో.

"ఏం నాయనా! మనకేం కొరత యిప్పుడు? భగవంతుడు మనకు కూటికి, గుడ్డకు కొరతలేకుండా పోషిస్తూనే యున్నాడుకదా! రక్తిని, ముక్తిని ప్రసాదించే భగవన్నామ సంకీర్తనతో ఆనందంగా జీవయాత్ర సాగిస్తున్నాము. మనకింతకంటె తృప్తికరమైనది ఏమికావాలి? మన జీవితావసరాలకు మించిన అర్జన మానవునకెప్పుడు వాంఛనీయంకాదు; మానవుని మితిమీరిన డబ్బు, డబ్బుమీదికాంక్ష లెక్కలేనన్ని తప్పుడు మార్గాలలో నీతినియమాలను తప్పి నడిపిస్తుంది. అట్టి జీవితమునేనా మనం భగవచ్చింతను, పరమార్థమును వీడి అపేక్షించవలసినది?"

"చాల బాగుందిలే నాన్నా! నీవు చెప్పడం! - రాజాస్థానానికివెళ్లి అనేకమంది గాయకులు, వేలు వందలు ఆర్జించుకొని సుఖంగా జీవయాత్ర సాగిస్తుంటే మనమిలాగే బజారు, బజారు తిరుగుతూ బిచ్చమెత్తుకుంటున్నాము" అన్నాడు నిష్ఠూరంగా.

"బాబూ! యిప్పుడు నీవు అనిన మాటలు మరొకసారి పలుకవాక - జాగ్రత్త! భగవన్నామ

సంకీర్తనకని యుద్దేశించిన నా గానమును వేలుకాదు కదా - లక్షలిచ్చినా రాజులైనాసరే, రారాజులైనాసరే వారి ఆజ్ఞల ననుసరించి, వారి ఆనందానికి, నా పొట్టకూటి సంపాదనకు వినియోగించను. అది భగవంతుని సొమ్ము. భగవంతునకే కైంకర్యము కావలసినది. మన మంచి చెడ్డలను ఆ దీనజనబాంధవునికే వదులుదాం" అన్నాడు ఉద్రేకంతో. ఆ యుద్రేకాన్నిచూచి కొడుకు కుక్కిన పేనులాగయి పోయాడు.

ఆ వృద్ధుని గాన మాధుర్యాన్ని గురించి రాణి విని రాజుతో చెప్పింది. మంత్రిని పిలిపించి ఆ యంధగాయకుని గురించి భోగట్టా అడిగాడు.

"ప్రభూ! అతడొక దివ్య పురుషుడు - పరమ భక్తుడు. ధనాపేక్ష లేదు. భగవంతు నుద్దేశించి, భగవత్సాన్నిధ్యములోతప్ప రాజులుకాని, రారాజులుకాని వారి ఎదుట, ఆ స్థానాలలో వారిని కీర్తించడు; పాడడు" అన్నాడు మంత్రి.

"అయితే నీవాతనిని మన ఆస్థానంలోకి పిలుచుకొనిరాలేని అశక్తుడవన్నమాట!"

"లేదు ప్రభూ! - ఎలాగైనా పిలుచుకొని వస్తాను" అని వెళ్లిపోయాడు.

మంత్రి అమావాశ్య చీకట్లో ఆ యంధగాయకుని యింటికివెళ్లి సన్నని దీపపు వెలుతురులో మంచముమీద కూర్చొనియున్న బాలుణ్ణి యివతలికి పిలిచి "బాబూ! యిదుగో యీ మధుర భక్ష్యాలను, ఉడుపులను తీసికో" అని అతనిచేతి కందిచ్చాడు.

"ఇవన్నీ ఏమిటి బాబయ్యా!" అన్నాడు బాలుడు.

"మీ దరిద్రము తొలగిపోయే రోజులు వచ్చాయి. నీవు మీ నాయన రాజాస్థానానికివచ్చి, మీ నాయన గాన మాధుర్యాన్ని వినిపిస్తే మీరు కోరినంత ధనం. అది మాత్రమే కాదు - ఏదికోరితే అది - నీవు ఎలాగైనా మీ నాయన్ను వెంటబెట్టుకొనివచ్చి పాడించాలి. మీ అదృష్టానికిదియొక మహదావకాశం" అని చెప్పి మెల్లగా వెళ్లిపోయాడు. తను తండ్రి నెలా ఒప్పించి రాజాస్థానంలో పాడించగలనా అని అనుకొంటూ గుడిశలోకి వెళ్లాడు.

"ఎవరు బాబూ! గుడిశ వెలుపల మాట్లాడుతున్నట్లున్నది" అన్నాడు తండ్రి.

"ఎవరో ఒక దయార్ద్ర హృదయుడు - మనకని యీ భక్ష్యాలు, ఉడుపులు తెచ్చియిచ్చి వెళ్ళాడు."

"భగవంతుడు దీన జన రక్షకుడు. ఆయన దయాకటాక్షములు అనన్యములు" అంటూ ఉడుపులను చేతులతో తడువుతూ కొడుకుముందుపెట్టిన భక్ష్యాలను చేతితో తీసికొని తినసాగాడు. తండ్రి కొడుకులు తిని చెరొక మంచంమీద ఒత్తిగిల్లారు.

మర్నాడు ఉదయం గాయకుణ్ణి వెంటబెట్టుకొని కొడుకు బయలుదేరాడు. ఎంతో దూరం నడిచారు. గమ్యస్థానమంటూ కానరాని అంధుడు "ఏం బాబూ! మనం చాలదూరం వచ్చినట్లున్నది! - యీ రోజెవరు మనకు కాని డబ్బంటూ యిచ్చినట్లు లేదే!" అన్నాడు.

"లేదు నాన్నా! మనం రామలింగస్వామి ఆలయానికి వెళుతున్నాము. అక్కడ యీ రోజున ఉత్సవ వేడుకలట-అక్కడైనా భగవంతుడు మనకు యీనాడు కడుపునిండే సావకాశం కల్పిస్తాడేమో!"

"తప్పక కల్పిస్తాడు బాబూ! త్వరగా పోదాం పద - ఎండెక్కినట్లున్నది; క్రింద, పైనకూడ కాలుతున్నది" అని బాలుని వెంబడి వడివడిగా నడువసాగాడు.

రాజభవనం ముందుకు రాగానే "దగ్గరకు వచ్చాం నాన్నా! ఆలయ సమీపం యిదే" అన్నాడు బాలుడు.

"ధన్యులం" అంటూ కంఠమెత్తి పరమేశ్వరుని కీర్తిస్తూన్న గాన మాధుర్యాన్ని చిందింపజేస్తూ

ముందుకు నడువసాగాడు. రాజభవనం ముఖద్వారం సమీపించి మెట్లెక్కుతూ "ఇవి దేవాలయం మెట్లు లాగలేవే" అన్నాడు.

"దేవాలయమే నాన్నా! యింకా పది అడుగులు ముందుకు నడిస్తే గర్భగుడి" అంటూ చెయ్యి పట్టుకొని ముందుకు తీసికొని వెళ్ళాడు.

రాజు దర్బారులో ఆసీనుడైయున్నాడు. చీమ చిటుక్కుమన్నా వినపడేటంతటి నిశ్శబ్ద వాతావరణంలో అంధగాయకుని సింహాసనాని కెదురుగానున్న ఉన్నతాసనంమీద కూర్చొన బెట్టాడు.

"బాబూ! యిదిచూడ దేవాలయంగా తోచడం లేదు - రాజభవనంలాగున్నది - చలవరాళ్ల నేల, గుమగుమలాడే సుగంధవాసనలు - సరే యీ ఆలయంలో ఎక్కడా ఏ శబ్దము వినిపించడంలేదుమరి-మనంతప్ప మరవ్వరూ లేరా ఏమిటి!"

"కొన్ని వేలమంది నీ చుట్టూ యున్నారు. నీ భగవన్నామ సంకీర్తనం వినాలని నిశ్శబ్దంగా చలనరహితులుగా నున్నారు."

"అలాగా!" అని భక్తి పారవశ్యంలో భగవంతుని భజిస్తూ అమోఘంగా గాన సుధను వర్షించాడు. రాజు ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయినవి. రాజు, రాణి "భేష్! భేష్!" అని ఎలుగెత్తి తన్మయత్వంలో అన్నారు. దర్బారులోని మంత్రులు, సామంతులు కరతాళ ధ్వనులు, హర్ష ధ్వానాలు చేశారు.

మరుక్షణంలోనే అనర్గళమైన గానవాహిని ఆగిపోయింది.

"బాబూ! యిది దేవాలయం కానట్లున్నది - నిజంచెప్పు - మన మెక్కడున్నామిప్పుడు" అని గద్దించి అడుగుతూ తాను కూర్చున్న ఆసనము దిగాడు.

కొడుకు తండ్రి కోపాన్ని చూచి హడలిపోయాడు. మంత్రి "ఇది మనరాజుగారి దర్బారు - మీరు రాజుగారి ముందున్నారు" అన్నాడు.

"ఆ! ... ద్రోహం... మోసం. భగవత్సాన్నిధ్యమనిచెప్పి నన్నిచ్చటికి పిలుచుకొనివచ్చి భగవన్నామ సంకీర్తనాన్ని కలుషితంచేయ పూనుకున్నారా మీరు? - ఇంతకాలం భగవంతు నుద్దేశించి, భగవంతుని ఎదుట చేస్తున్న సేవను, ఆరాధనను మంట కలిపిన దుర్మార్గులు మీరు - డబ్బుకు, తుచ్ఛ సుఖానికి ఆశపడి నన్నీతప్పుదు దోవకు తెచ్చినందుకు నీపై మొదట పగతీర్చుకోవాలి" అంటూ రౌద్ర నరసింహ మూర్తిలాగ అటూ యిటూ దర్బారులో పరుగిడసాగాడు. పసిబాలుడు భయభ్రాంతుడై ఏమూలనో నక్కాడు. మంత్రులు, సామంతులు బహుమతులను, పళ్ళాల్లో నుంచుకొని ఆ గాయకుని కర్పించాలని అటు యిటు పరుగెత్తసాగారు. కబోది గాయకుడు ఆ త్రొట్టుపాటుతో అటూ యిటూ పరుగెత్తి మేడమెట్లమీద కాలుజారిపడి ముఖాన బలమైన గాయము తగిలి రక్తము ప్రవాహంలాగ కారజొచ్చింది.

"భగవంతుడు నేను చేసిన అపరాధానికి తగిన రీతిగా నన్ను శిక్షించాడు. దాంతోపాటు యీ నా అపరాధాన్ని ప్రేరేపించి ప్రోత్సహించినవారికి సయితం యీ ఉసురుకొట్టక తప్పదు" అంటూ అంధగాయకుడు పరమాత్మలో ఐక్యమైపోయాడు.

కొడుకు వెక్కి వెక్కి ఏడ్చాడు. ప్రభువు అతన్ని తన ఆస్థానంలోనే యుంచుకొని తన కుమారునితో బాటు పోషించసాగాడు.

అంధగాయకుని అస్తమయమైన పదిరోజులకే రాజకుమారునికి ప్రమాదకర పరిస్థితి ఏర్పడింది. అతనికి స్వస్థత చేకూర్చగల వ్యక్తి ఎవరూ కనుపించ లేదు.

రాజకుమారుని శయ్య ప్రక్కన మోకాళ్లమీద నిలుచుండి తదేక ధ్యానంతో "భగవంతుడా! మానవుడు తెలిసీ, తెలియకుండాకూడ అనేక అపచారములు చేస్తుంటాడు. అట్టిదే మా నాన్నపట్ల జరిగింది. అందును గాను ప్రతీకారంవద్దు ప్రభూ! రాజకుమారుని కాపాడి రాజకుటుంబాన్ని పశ్చాత్తప్తులనుచెయ్యి!" అంటూ పలుమారు ప్రార్థించసాగాడు. క్రమంగా రాజకుమారుడు ఆరోగ్యాన్ని కోల్కొన్నాడు. త్యాగధనుడైన అంధగాయకుని పట్ల భక్తి, గౌరవ సూచకంగా అతని కొడుకును ఆ రాజ్యంలో ప్రేమాభిమానములతో రాజకుటుంబము, ప్రజలుకూడ ఆదరించేవారు.

—o—

# సిరిసిరిమువ్వలు

జ్యోతిష్కుడు: నీకేం మహారాజువు! కాలుకదుపుతూ సంపాదిస్తావు.

ఎదటివ్యక్తి: ఉన్నదున్నట్లు చెప్పారు–నేనుమిషన్ కుట్టుకుని బ్రతికేవాడిని.

♦ ♦ ♦

"మూర్తీ! ఎక్కడ ఏవిషయం ఎప్పుడు జరిగినా అది వెంబడే నా బుర్రలోకి దూరి ఎంతకాలమయినా జ్ఞాపకముంటుంది"

"అయితే చూడూ! — ఆరు నెలల క్రిందట నా దగ్గర పదిరూపాయలు బదులు తీసికున్నావు జ్ఞాపకముందా!"

"అదా! — ఆ డబ్బు నా జేబులోకి పోయిందికాని బుర్రలోకి పోలేదే"

'అర్జునుడు'

♦ ♦ ♦

"ఏమండీ ప్రపంచములో ఎక్కువ తియ్యనిదేది?"

"ఇవి, అవి కొనిపెట్టమని వేధించకుండా, అక్కడికీ, యిక్కడికి వెళ్ళాలని పోరుపెట్టకుండా, చీటికి మాటికి రుసరుసలాడకుండా భర్తను అనుసరించే భార్య."

"భార్య అంటే మీకు బాగా మొగం మొత్తినట్లున్నదే!"

"అవును"

"ఎందుకని?"

"నాకు తీపి ఎక్కువ యిష్టంకాదు కాబట్టి"

"అయితే నన్నెందుకు పెళ్లి చేసికొన్నారు?"

"నేనుకాకపోతే మరెవ్వరు నిన్ను పెళ్లి చేసికోరేమోనని!"

♦ ♦ ♦

"సుబ్బీ! నిన్ననీవు అమ్మాయిని చంకబెట్టుకొని వెళ్లేటప్పుడు ఎవరో అమ్మాయిని ముద్దుపెట్టుకున్నారటగా!"

"లేదమ్మగారూ!"

"ఇకముందైనా ఎవరిని ముద్దుపెట్టుకో నీయవాక"

"లేదమ్మగారూ! నేనుండగా అమ్మాయిని యితరులు ముద్దుపెట్టుకోనిస్తానా!"

♦ ♦ ♦

"బావా! తెల్లని కాకుల నెప్పుడైనా చూచావా?

"లేదు — కాని నల్లని కాకులను తెల్లని కాకులుగా చేయవచ్చు?"

"అదెలాగ?"

"ఇంత స్నో, పౌడరు దట్టంగా మెత్తితే సరి!"

"బలే బాగుంది నీవు చెప్పడం!"

"కాకేమిటి! — ఫేసుపౌడరు. స్నో మెత్తుకొని ఎన్ని నల్లమొగములు తెల్లబడటం మనంచూడడంలేదు!"

'లక్ష్మి'

............



## వాహిని వారి 'బంగారు పాప'

ఉత్తమ ఆదర్శాలతో, లక్ష్యాలతో, ఎప్పటి విశిష్టతను నిరూపించుకుంటూ వాహినివారు శ్రీ బి. యన్. రెడ్డిగారి దర్శకత్వంతో 'బంగారు పాప' చిత్రాన్ని నిర్మించి విడుదలచేశారు.

అందలి కథ మనసాంఘిక జీవితమును ఉన్నదున్నట్లుగా చిత్రిస్తూ చాలసహజంగాను, హృదయాలను చలింపజేసే సంఘటనలు, సన్నివేశాలతో రూపొందింది. మాటలు, పాటలు సయితం సమయస్ఫూర్తిగా, భావరసపూరితంగా నుండినవి.

నేటి జీవితంలోని స్త్రీ పురుషుల మనస్తత్వాలు, నడవడి, వాని ఫలితంగా అనుదినం ఏర్పడుతున్న వివిధ సమస్యలు, పరిణామాలు యీ చిత్రంలో పొందుపరచబడి యుండటమేకాక నైతికస్థాయి పెరుగుదలకు ప్రబోధం జరిగింది. ఆర్థికసమత్వమునకు గల అవకాశాలను గురించి ఆలోచనలు జరిగే యీ రోజులలో కమ్మరి కోటయ్య యింట్లో పెరిగిన పాప, జమీందారుగారి అబ్బాయి శేఖర్‌ల ప్రణయగాథ సాంఘిక పురోభివృద్ధికి దోహదం కావాలి.

గ్రామీణ జీవితంలోని వేడుకలను, వినోదాలను చిత్రించడానికి శ్రీ రెడ్డిగారు ప్రత్యేక శ్రద్ధ వహించినట్లుకనుపించింది. కాని అవి అంత ఎక్కువగాలేక మనోహర్, శాంతల భూమికలను విస్తృతం చేసి యుండవచ్చును.

కోటయ్య పాత్రను యస్. వి. రంగారావు అమోఘంగా నిర్వహించాడు. మనోహర్ భూమికలో యింకా కొంచము జీవమున్నట్లయితే బాగుండేది. శ్రీ రెడ్డిగారి దర్శకత్వ ప్రజ్ఞా విశేషాలే కారణమా అన్నట్లు పాపగా కృష్ణకుమారి చక్కగా రాణించింది. శేఖర్‌గా రామశర్మ పాత్రౌచిత్యాన్ని పోషించుకున్నాడు.

శ్రీ అద్దేపల్లి రామారావుగారి సంగీతదర్శకత్వమునకు యీ చిత్రము ఒక గీటురాయి.

రెండవ సగంలో చిత్రము అత్యుత్తమస్థాయి నందుకున్నది.

'బంగారు పాప' చిత్రము సర్వజనాదరణీయమై దిగ్విజయయాత్ర సాగించగలదని ఘంటాపథంగా చెప్పవచ్చును. శ్రీ రెడ్డిగారి అపార అనుభవ ప్రజ్ఞలు తెలుగు చలన చిత్ర పరిశ్రమ పురోభివృద్ధికి యింకను వినియోగపడగలవని మా విశ్వాసం.

—పున్నయ్య



(850 వ పేజీ తరువాయి)

మొదలైన ఆందోళనలు రేకెత్తినవి. బ్రహ్మ సమాజ దృష్టికి ఆంధ్రదేశములోని కొందరు వశులైరి. వీరిలో కందుకూరి వీరేశలింగముపంతులుగారు, వేంకటరత్నము నాయుడుగారు ముఖ్యులు. పంతులుగారు సత్యవాదులు. సత్యాగ్రహి. ఎల్లప్పుడు సాహసికుడుగా నుండవలె. పంతులుగారు సమాజములోనున్న మూఢ నమ్మకాల్ని నిర్మూలించుటకు సిద్ధపడిరి. నాడు స్త్రీలు ఎట్టి దుస్థితిలో నున్నారో కనిపెట్టినారు. బాల్య వివాహాలు, బహు వివాహములను నిరోధిస్తూ యథాశక్తిన విధవా వివాహము, వేశ్యోద్ధరణము కావించటానికి వారు నడుము కట్టారు. దేశంలో ఈ విధమైన సంచలనమువల్ల ప్రబల విరోధము ప్రబలినది. అయినప్పటికి పంతులుగారు చలించలేదు. తన భావాల్ని ప్రజల ముందుంచాడు. దీన్నుంచియే సరళమైన సాహిత్యమును నిర్మించుటకు సిద్ధపడ్డాడు. అందుకై వ్యావహారిక భాషలో సాహిత్య రచనావశ్యకతను వివరించినారు. ఈ ఫక్కీలోనే చాలా గ్రంథాల రచనకు పూనుకొన్నారు. సులభమైన భాషలో మొట్టమొదటగా గ్రంథరచన చేసినది ఈయనయె. వీరేశలింగముగారు ఆధునిక యుగ నిర్మాత అనినచో అతిశయోక్తి యేమీ లేదు.

దేశంలో స్వరాజ్యాందోళన సాగుతున్నంత కాలము విదేశీయుల అధికార ప్రాబల్యమువలన దేశముయొక్క ఆర్థిక, సామాజిక, రాజకీయనైతిక పతనము కాజొచ్చెను. దేశాన్ని స్వతంత్రము చేయవలెనని తీవ్ర ఆందోళనము ప్రబలినది. కొందరు దేశభక్తుల ప్రేరేపణవల్ల యువకులకు చైతన్యము కలిగెను. ఈ మహాత్కార్యాన్ని కత్తిచేయలేని పనిని కలము చేయగలదని నిరూపించిరి. సామాన్య ప్రజానీకానికి అర్థమయే భాషలో—అంటే వ్యవహారికములో కవిత్వమల్లడము నిషిద్ధము. ఎవరైనా సాహసించినచో వారు ప్రాచీన సాహిత్యానికి తీరని అపచారము చేసినారన్న మాటలకు గురికాకపోరు. కాని, యువ కవులు వ్యావహారిక భాషలో స్వరాష్ట్రాన్నిగూర్చి పొగడుతూ పాటలు వ్రాయడం మొదలు పెట్టారు. మరో ప్రక్కనుంచి గిడుగు రామమూర్తిపంతులుగారు వ్యవహారిక భాషా వ్యాప్తికి ప్రయత్నించసాగిరి. వారు యెన్నో తర్కములకు ఋజువు చేసిరి. జనసాధారణమునకు అవసరమయ్యే భాషే అసలైన సిసలు భాష. దానికి మంచి రూపములో సాహిత్యాకాశములో ఒక స్థానము కల్పింపబడవలెను. కాని, వీరి ఆందోళనము పూర్తిగా నెరవేరిందని చెప్పలేము.

ఈ రోజులలోనో, యింతకుముందో దేశంలో ధార్మిక జ్ఞానముగూడ చూడబడుచున్నది. స్వామి దయానందగారు ఆర్యసమాజమును స్థాపించి, దాని ద్వారా హిందూధర్మముయొక్క మహత్తుకు ప్రజల దృష్టి ఆకర్షింపబడునట్లుచేసెను. కొద్ది రోజుల తరువాత స్వామి వివేకానంద ప్రజలలో ఒక గొప్ప చురుకుదనమును కల్పింపజేసెను. ఈ ధార్మిక జ్ఞానము యొక్క ప్రభావము తెలుగు సాహిత్యముమీదకూడ పరిరక్షితమైనది. ఇంతియేకాక పాశ్చాత్యము, బెంగాలీ సాహిత్య ప్రభావముకూడ తెలుగు సాహిత్యముమీద పడినది.

ఇంతకుముందు చెప్పబడిన ఆందోళన ప్రభావము తెలుగు భాషకు వికాసము కలిగించినది. ఆధునిక కవిత్వముపుట్టి దాదాపు 1900 సంవత్సరాలు. 1900 సంవత్సరాలనుంచి యిప్పటివరకు మూడు భాగములు చేయవచ్చును.

## (ప్రథమోన్నతి. 1900 నుంచి 1920 వరకు)

ఈ ఇరువదియవ శతాబ్దములో తెలుగు కవిత్వములో నూతన పోకడలను చూస్తున్నాము. ఇంతకుముందు కవిత్వము రాజదర్బారులలో చదివి వినిపించుచుండెడివారు; ఇప్పుడయితే పట్టణాలు మొదలుకొని చిన్న చిన్న జనపదాలవరకుగూడ వినగల్గుచున్నారు. సామాన్య ప్రజకు అందుబాటయిన కవిత యిప్పుడు వచ్చింది. తిరుపతి వేంకటేశ్వర కవులు (తిరుపతిశాస్త్రి, వేంకటశాస్త్రి) అను పేరుతో కవిద్వయము ఒక విధముగా తెలుగు కవిత్వాన్ని రాజదర్బారనే కారాగృహమునుంచి వదలించి సామాన్య ప్రజానీకానికి హత్తుకునేటట్లు కవిత సాగిం

చారు. ఈ యిద్దరూ సంస్కృతాంధ్రములలో ఉద్దండ పండితులు. భాష వారికి దాసి; భావము సేవకుడు. వారికి కవిత్వము చెప్పటము ఎడమచేతితో ఆట ఆడడము వంటిది. వారి కవిత్వములో భాషా భావములు చాల సరళముగా నడుస్తవి. ఈ కవిద్వయముయొక్క శిష్యులు, ప్రశిష్యులు ముందుకు వచ్చి మధుర కవితను అందించారు. ఆధునికకైత రెండు రూపములలో కన్పించుతున్నది - పాటలలోను, ఖండ కావ్యములలోను. ఈ పాటలలోని భాష, భావము, వ్యంజనము అన్నిటిలోను క్రొత్త దారులను చూడగలము. పాటల రచనలో క్రొత్త పద్ధతి నవలంబించినవారు గురజాడ అప్పారావుగారు ప్రథములు. వారు తమ గేయములలో దేశభక్తిని గూర్చి ప్రస్తావించారు. వీరి గీతములు బహుజనాదరణ పొందినవి. మచ్చుకు అప్పారావుగారి ప్రసిద్ధ గీతము:

"దేశమంటే మట్టికాదోయ్;
దేశమంటే మనుషులోయ్"
"దేశాభిమానము నాకు కద్దని,
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్."
"పూని యేదైనాను ఒక మేలు,
కూర్చి జనులకు చూపవోయ్."

వీరి "ముత్యాల సరాలు," "నీలగిరి పాటలు" చాల ప్రసిద్ధిచెందినవి. అప్పారావుగారి గేయముల ద్వారా ఆధునిక కవిత్వములో ఎంతటి క్రొత్త పోకడలు వచ్చినవో రాయప్రోలు సుబ్బారావుగారి ఖండకావ్యములలోగూడ నట్లేవున్నవి. సుబ్బారావుగారు పరిష్కరించటములో గొప్పవారు. సంస్కృతము, తెలుగు, ఆంగ్లభాషలలో మంచి పాండిత్యము, ఉత్తమమగు భావనకలవారు. వీరు చాల ఖండకావ్యములను, గేయములను వ్రాసినారు. ఖండకావ్యములలో "తృణకంకణము", "లలిత," "అనుమతి," "స్వప్నకుమారి," "స్నేహలత," "మధుకలశము" మొదలైనవి లోకప్రసిద్ధము. వీరి "లలిత" "హెర్మిట్" అను ఆంగ్ల కథకు ఆధారము తీసికొని వ్రాయబడినది. అయినప్పటికి అందులో వారి స్వంత కల్పనలు యెన్నియో నున్నవి. ఈ కావ్యములోని వస్తువు, భాష, భావము, శైలి మృదు మధురంగా వుండి క్రొత్త పోకడలతో కవిత్వము కన్పించుతున్నది. పవిత్రప్రేమను ఆధారముచేసికొని వీరి కావ్యసృష్టి జరిగింది. ఈ యుగములోనే యింకనూ చాలమంది కవులున్నారు. వారు పూర్వశైలినే అనుసరించారు.

## (ద్వితీయోన్నతి : 1920 నుండి 1930)

ఈ పది సంవత్సరముల కాలములో నవ్యకవిత్వము ప్రౌఢమైనది. ఈ కాలములోనున్న కవులలో రెండు రకముల మార్పు కలిగినది. మొదటిది బెంగాలీ సాహిత్యము, రెండవది ఆంగ్ల సాహిత్యము. ఆ రోజుల్లో మచిలీపట్టణము, రాజమహేంద్రవరము విద్యాకేంద్రములు. మచిలీపట్టణములో వేంకటరత్నమునాయుడుగారు తమ సాహిత్య సంపత్తిని శిష్యులకు పంచియివ్వసాగిరి. రాజమహేంద్రవరములో "కూల్డ్రే" దొరగారు తమ శిష్యులకు ఆంగ్లేయ సాహిత్య రసాస్వాదన గావించుచుండిరి. ఈ మహాత్ము లిద్దరి దగ్గర చాలమంది యువకులు విద్య నభ్యసించి తెలుగు కవిత్వము చెప్పటలో సమర్థులయిరి. ఆంగ్లేయ సాహిత్య ప్రభావమువలన "రొమాంటిక్" కవిత్వము దాదాపు తెలుగు నవ్యకవిత్వమునకు అంటుకొన్నది. షెల్లీ "ప్రేమ రహస్యవాదము" (Love Mysticism,) వర్డ్స్‌వర్త్ "ప్రకృతి రహస్యవాదము" (Nature Mysticism,) కీట్స్ "సౌందర్య వాదము" - ఈ విధమైన పోకడలనుంచి కవులు తమ రచనలను సాగించిరి.

కొందరి కవుల కావ్యవస్తువు రాష్ట్రీయము. అయినప్పటికి కొందరు ప్రతిభావంతులు తమ కావ్యములలో సౌందర్యము, ప్రేమ, కరుణరసములను పోషించిరి. ఈ యుగకవులు పూర్వకవులకు చాల భిన్నముగ నుండిరి. వీరు ప్రకృతియొక్క బాహ్య సౌందర్య వర్ణనతో తృప్తిపొందలేదు. వారు ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము మొదలైన అలంకారములతోనే సౌందర్య సాధనను అంతమొందింపక ప్రకృతి

యొక్క ఆంతరంగిక సౌందర్యమునుగూడ ఆరాధించిరి.

ఈ విధముగ ఈ యుగకవులు కావ్యములను ఒక నూతన పంథాలో పెట్టసాగిరి. వీరి శైలిగూడ అపూర్వమైనటువంటిది. వ్యంజనముగూడ క్రొత్తదనము. ఈ రకములో కృషిచేసినవారిలో దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు ఒకరు. వాద వాదతిరిగి వారు కవిత్వముయొక్క విశిష్టతను ప్రజలకు వినిపించారు. ఈ నవీన కవులంతా చేరి 'సాహితీ సమితి' అను నొక సమితిని స్థాపించి దాని ద్వారా 'సాహితి' తరువాత 'సఖి' అను పత్రికలద్వారా నవీన కవితను ప్రజల కందించారు.

ఈ యుగ కవులలోనే శ్రీయుతులు శివశంకర శాస్త్రి, బసవరాజు అప్పారావు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, నండూరి సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, వేదుల సత్యనారాయణ, అడవి బాపిరాజు యింకా నరసింహశాస్త్రి మొదలైన ప్రసిద్ధకవులున్నారు. వీరంతా ప్రజాదరణ పొందినవారే. శివశంకర శాస్త్రిగారి కవిత బ్రహ్మజ్ఞాన పరిపూర్ణమై 'రహశ్యవాదం'లో కలిసిపోతుంది. బసవరాజు అప్పారావు "ఆంధ్ర భావకు కీట్స్" వంటివాడు అని అంటారు. వీరి గీతాలు ఎంతో బాగుంటాయ్. విశ్వనాథ సత్యనారాయణగారు ఈ యుగ ప్రతినిధి అని చెప్పవచ్చును. వీరు ప్రాచీన శైలిలోగూడ కావ్యములు వ్రాశారు. నవ్యశైలిలో వీరి "కిన్నెరసాని పాటలు" ప్రజలను బాగా ఆకర్షించాయి. కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతముగార్లు నవ్యకవిత్వానికి నాయకులనవచ్చు. వీరి "సౌందర నందము" భావంలోగాని, శైలిలోగాని యింతకు మించిన పుస్తకము లేదంటే అతిశయోక్తికాదు. దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారిలో ఒక విలక్షణమైన వ్యక్తిత్వమున్నది. వీరి "కృష్ణపక్షము" తెలుగు సాహిత్యములో ఒక సుస్థిరస్థాన మేర్పరచుకున్నది. ఇక నండూరి సుబ్బారావుగారి "యెంకిపాటలు" ఆంధ్రదేశం మొత్తమ్మీద ప్రసిద్ధికెక్కినవి. ఈ గీతాలలో సుందరము, లలితములైన భావములు సామాన్య భాషలో వున్నవి. దువ్వూరి రామిరెడ్డిగారి కవిత్వముగూడ చాల సరసంగా వుంటుంది. రహస్య వాదానికి సంబంధించి ఒక ఖండ కావ్యము గూడ వీరు రచించారు.

## (తృతీయోన్నతి : 1930 నుండి)

ఈ యుగములోనే అనవరతమైన దీక్షవల్ల ఆధునిక కవిత్వము ప్రజల మన్నన బడసినది. గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావుగార్ల నవీన కవిత్వ అనుయాయుల్లో చేరినటువంటివారు జాషువ కవిగారు. వీరి ఖండకావ్యములు ఆంధ్రదేశమంతటా మారు మ్రోగినవి. వీరి "గబ్బిలము" యింగ్లీషు భాషలోకి అనువదించించబడినదని వింటున్నాము. వీరి కవిత్వముగూడ చాల మాధుర్యముగానున్నది. ఇక యథార్థవాది కవితకు ప్రవక్త శ్రీరంగం శ్రీనివాసరావుగారు. నవకవనానికి కావలసిన సామగ్రి యేమిటంటే.

"సింధూరం రక్త చందనం
బంధూకం సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురు
ఎగరేసిన ఎర్రని జండా,
రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళీ నాలుక
కావాలోయ్
నవకవనానికి"

ఇంకా వీరి శైలి పరికించండి :

"కదలేది కదలించేది
మారేది మార్పించేది
పాడేది పాడించేది
పెనునిద్దర వదలించేది
పరిపూర్ణం బ్రతుకించేది
కావాలోయ్ నవకవనానికి"

ఈ విధంగా మనం తెలుగు సాహిత్యంలో నవకవిత్వము రోజు రోజు వృద్ధిపొందటం చూస్తున్నాము. ఇంకా మార్పులొస్తాయని చూద్దాం.



# మద్రాసు సంగీత కళాశాల (గోపాలపురం)

## తొమ్మిదవ వార్షికోత్సవము



ఫిబ్రవరి నెల 18వ తేదిన మద్రాసు సంగీత కళాశాల తొమ్మిదవ వార్షికోత్సవము కళాశాల ఆవరణలో 'హిందూ' పత్రిక సహాయ సంపాదకులు శ్రీ యస్. రఘునాథయ్యర్ యం. ఏ., యల్. యల్. బి. గారి అధ్యక్షతన వైభవముగా జరిగింది. ఉత్సవ కార్యక్రమము కళాశాల ప్రిన్సిపాల్స్ రచించిన నక్షత్రమాలికా వర్ణముతో ప్రారంభమయి, శ్రీమతి ద్వారకా పార్థసారథిగారు వార్షిక నివేదికను చదివిరి. నివేదికలో గాత్ర సంగీతమునకు తాము ప్రాముఖ్యత యిచ్చుచున్నట్లును, విజ్ఞానవికాసాభికని నెలవారీ సభలు జరుపబడుచున్నట్లును వివరించబడెను.

ఆంధ్ర మహిళ సంపాదకురాలు శ్రీమతి కే. లక్ష్మీరఘురాంగారు గవర్నమెంటు పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు బహుమతులను, యోగ్యతా పత్రములను పంచిపెట్టిరి.



మద్రాసు సంగీత కళాశాల (గోపాలపురం)
తొమ్మిదవ వార్షికోత్సవము నాటి ఛాయాచిత్రము.

శ్రీ రఘునాథయ్యర్ గారు అధ్యక్షోపన్యాసములో కళాశాల ప్రిన్సిపాల్ కృషిని ప్రశంసిస్తూ పూర్వకాలపు గురుకుల వాసపు విద్యావిధానపు ప్రాశస్త్యము జ్ఞప్తికి తెచ్చే శిక్షణావసతులు యీ కళాశాలలోనున్నందుకు సంతోషమును వెలిబుచ్చుచూ శ్రీమాన్ యన్. సి. పార్థసారథి దంపతులు విద్యార్థులను తమస్వంత బిడ్డలవలె చూచుకొనుచు చక్కని శిక్షణ నిచ్చుచున్నారనిరి. ఇంకాయిట్టి కళాశాలలు నగరంలో అనేకము కావలసియున్నవనియు, యీ కళాశాల పురోభివృద్ధికి చాలవరకు గోపాలపురం వాసుల ప్రోత్సాహమే కారణమని నమ్ముచున్నామనిరి.

తర్వాత కళాశాల విద్యార్థి, విద్యార్థినులు సంగీతముతోను, కుమారి లక్ష్మీ పున్నమ్మ నృత్యముతోటి, కళాశాల బాల విద్యార్థినులు త్యాగయ్య విరచితమైన నౌకాయాత్ర సంగీతనాటికను నాట్య, గాన, అభినయాదులతో కూడిన ప్రదర్శనలతోటి ప్రేక్షకులను ఆనంద పరవశులుగా చేసిరి. శ్రీమాన్ యన్. సి. పార్థసారథి గారి (ప్రిన్సిపాల్) వందన సమర్పణముతోటి, మంగళముతోటి, ఉత్సవ కార్యక్రమము ముగింపుకువచ్చెను.

---




**మేనక** : శ్రీ ఎమ్మనూరు చిన్న వేంకటరెడ్డి, ప్రతులకు : శ్రీ ఆర్. రామకృష్ణా రెడ్డి బి. కాం ; ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనర్, యాదాళ్ల వెంకటాచల వీధి, కడప, వెల రు. 1-0-0.

ఈ ఖండకావ్యములోని కథావస్తువు అప్సరసలలోని మేనక విశ్వామిత్రుని మోహించి అనుగ్రహపాత్రురాలు కావడం, ఆమె కారణివలన శకుంతల జన్మించడము. ఆమె పుత్రుడే భరతుడు.

రచయిత పాండిత్యముకలవాడగుటచే ఉత్తమ వాఙ్మయంలో మృదుమధుర శైలిలో మనోజ్ఞంగా రచన సాగించాడు. ఇందులోని వర్ణనలు, జాతీయములు యీ గ్రంథానికి మరింత రాణింపును సమకూర్చుచున్నవి. భావరసపోషణలు సయితం చక్కగా పోషింపబడి యుండుటచే ప్రజాదరాభిమానములకు పాత్రముకాగలదు.

**తీరనికోరిక** ('చిరంజీవి'నవల) అనువాదం : శ్రీ బి. విశ్వేశ్వరరావు. ప్రచురణ కర్తలు: పళనియప్పబ్రదర్స్, మద్రాసు 5. వెల రు. 1-0-0.

వివాహితులయి కూడ కామాంధకారంతో సంచరిస్తున్న వారి జీవితగాథను వస్తువుగా తీసికున్నదీ నవల. కాని యీ రచన నీతి, నియమాలను ప్రోత్సహిస్తూ సంఘ జీవితం క్రమబద్ధంగా రూపొందడానికి వుపకరించడంకంటె యీ నవల పాఠకులలో ఉద్రేకాన్ని, అసభ్యతను ప్రోత్సహిస్తున్నదా అనిపిస్తున్నది. ఇందులో అతివాస్తవంగా చిత్రించాలనుకున్న సంఘటనలు, సన్నివేశాలు ఉపయోగించిన అపశబ్దాలు, అపధ్యపు విషయాలు ఏవగింపు కలిగించినవి.

కామిని తాను భర్తతో కాపురంచేస్తూ శ్రీహరితో జరిపిన ప్రేమకలాపం కామతృష్ణకు నిదర్శనమయినా విచ్చలవిడిగా తన యింట్లో సాగుతున్న వారి అవినీతికర ప్రవర్తనను కామినిభర్త తెలిసికోలేకపోవడం, దాన్ని అరికట్టాలని ప్రయత్నించిన శశిని ఆమె మూర్తితో శశికున్న సంబంధాన్ని ఎత్తిపొడుస్తూ ఎదిరించిన సంఘటనలు సబబుగాలేవు. శశి, మూర్తి అవివాహితులు. వారిద్దరి సంబంధము వైవాహిక సంబంధముగా రూపొందతగినది. కామినికి శ్రీహరితోటి గల సంబంధము అట్టిదికాదు. కాబట్టి ఆ రెంటిని పోల్చడం అసందర్భం. కామినిది, ఆమె భర్తది విషాదాంతము. శశి తాను ప్రేమించిన మూర్తిని వివాహమాడలేక పోగా అతని తుదిఘడియలు ఆమె సమక్షాన గడచి పోవడం గమనించతగినది. శశి అన్నను, వదినెను, ప్రేమించినవ్యక్తిని పోగొట్టుకొని ఏకాకిగా నిలబడిన భగ్నహృదయ.

ఈ నవల కొంచెము జాగ్రతగా సాంఘికహితాన్ని ఉద్దేశించి రచింపబడినట్లైతే బాగుండేది. తాత్కాలిక ఉద్రేకానికి దోహదం చేసే రచనలవల్ల ప్రయోజనం శూన్యం.

---

# సంపాదకీయములు

## మానవుడు - దేవాలయాలు

'మానవుల ఉత్తమగతికి దేవాలయాలు మార్గదర్శకాలు' అని ఆంధ్ర రాష్ట్ర దేవాలయోత్సవాలు, శిల్పచిత్ర ప్రదర్శనము ప్రారంభిస్తూ శ్రీ అన్నారావుగారు ఉద్బోధించారు.

విజ్ఞాన బోధకమైన శిల్పకళాకేంద్రాలు మానవాభ్యుదయముపై అమోఘమైన ప్రభావము కలిగి యుండాలి.

మానవునిలోని మంచిచెడ్డలనే విచక్షణాజ్ఞానాన్ని నీతినియమాలను, సమరసద్భావములను, కళాపిపాస, కళారాధనలను ప్రోత్సహిస్తూ రక్తిముక్తిదాయకములుగా దేవాలయాలు, అందలి శిల్పసంపద మానవజీవితాన్ని రూపొందించకలుగాలి.

క్రైస్తవమత ఆలయాలు మానవాభ్యుదయానికి విశేషంగా తోడ్పడినవి. అదే విధంగానే హిందూదేవాలయాలు సయితం చిత్తశుద్ధిని, క్రమనిక్షణను, భగవద్భక్తిని పురికొల్పి ప్రజలలో నవచైతన్యములు విలసిల్ల జేయునవిగా నుండకలుగాలి.

## బళ్లారి స్కూళ్లలో తెలుగులో విద్యాబోధనకు స్వస్తి

ఎంతో కాలమునుండి తెలుగులో విద్యాబోధన సాగుతున్న బళ్లారిస్కూళ్లలో దానిని నిలిపివేయ మైసూరు ప్రభుత్వము నిర్ణయించడం శోచనీయము.

బళ్లారి నగరాన్ని మైసూరుకు కట్టిబెట్టడమే ఆంధ్రులకు తీరని అన్యాయము. పైగా ఆ నగర ప్రాంతములోనున్న అశేష తెలుగు భాషావాదుల బిడ్డలకు మాతృభాషలో విద్యావసతులను మైసూరు ప్రభుత్వము రద్దుచేయడము సామాన్య పౌరసత్వపు హక్కులకు భంగము కలిగించుటే కాగలదు.

కేంద్రము మైసూరు ప్రభుత్వ అనాలోచిత నిర్ణయాన్ని గమనించి జోక్యము కలిగించుకొని బళ్లారిలోని తెలుగు ప్రజానీకానికి న్యాయము కలిగించాలి!

## ప్రైవేటు ఆస్తులు - ప్రజాశ్రేయస్సు

ఇండియా ప్రధాని పండిత నెహ్రూ లోక్ సభలో రాజ్యాంగ సవరణబిల్లును ప్రతిపాదిస్తూ ఆస్తిపాస్తుల స్వాధీన సందర్భమున ప్రభుత్వము పరిహారము చెల్లించగలదనియు, పరిహారాల మొత్తాలనిర్ణయించే భారమును న్యాయస్థానముల పరిధినుండి పార్లమెంటుకు ఒప్పగించడమే యీ బిల్లు సంకల్పమని వివరించారు.

ప్రజాస్వామ్య పరిపాలన సాగడానికి శాసనసభలు ఎంత ప్రధానమైనవో ప్రజా ప్రతినిధుల యొక్క, ప్రజల యొక్క బాధ్యతలుకూడ అంతగురుతరమైనవే. శాసనసభలపట్ల విశ్వాసంపూరించవలసిన బాధ్యత ప్రభుత్వానికి, ప్రజాప్రతినిధులకున్నది. ప్రజలకు శాసనసభలు తమ అభ్యుదయపురోభివృద్ధులను అడుగడుగునా రూపొందిస్తున్నవనే నమ్మకం ఏర్పడిననాడు ప్రభుత్వమునకు ప్రజలకు మధ్యగల సౌన్నిహిత్యము, పరస్పర సహకార సద్భావాలు దృఢతరంకాగలవు.

# శ్రీ మన్మథనామ సం॥ర చైత్ర, వైశాఖమాసములు

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ ఏప్రిలు నెల | 16 | శ | న 46-55 శ్ర 58-51 సిద్ధియోగః |
| | 17 | ఆ | ద 47-42 ధ 60-10 త్యా 4-9 |
| | 18 | సో | ఏ 47-25 ధ 0-53 సిద్ధయోగః |
| | 19 | మం | ద్వా 45-46 శత 1-54 ప్రదోషాభావః |
| | 20 | బు | త్ర 42-57 పూభా 1-42 |
| | 21 | గు | చతు 38-53 ఉభా 0-20 రే 47-45 మాసశివరాత్రి |
| | 22 | శు | ● అ 33 56 అశ్వ 55-40 |
| | | | **వైశాఖమాసము** |
| | 23 | శ | శుక్లపా 28-18 భ 50-40 |
| | 24 | ఆ | వి 26-0 కృ 46-6 త్యా 3-42 తిథిద్వయం |
| | 25 | సో | తృ 15-32 రో 41-30 |
| | 26 | మం | చవి 9-1 మృ 37-10 |
| | 27 | బు | పం 2-47 ఏష్యం 54-4 ఆర్ద్రా 33-0 |
| | 28 | గు | స 51-54 పున 29-35 |
| | 29 | శు | అ 47-54 పుష్య 27-4 త్యా 3-55 దగ్ధయోగః |
| | 30 | శ | న 45-1 ఆశ్రే 25-36 శేషత్యా 2-17 సిద్ధియోగః |
| 1955 సం॥ మే నెల | 1 | ఆ | ద 43-21 మఖ 25 19 |
| | 2 | సో | ఏ 42-55 పూఫ 26-13 త్యా 4-9 |
| | 3 | మం | ద్వా 43-43 ఉఫ పరశురామద్వాదశి |
| | 4 | బు | త్ర 45-38 హ 31-38 |
| | 5 | గు | చతు 48-33 చిత్త 55-53 నృసింహజయంతి |
| | 6 | శు | ○ పౌ 52-17 స్వా 41-0 |
| | 7 | శ | కృపా 46-30 విశా 43-33 |
| | 8 | ఆ | వి 60-10 అనూ 52-39 తిరువళిక్కేణి పార్థసారథిస్వామి గరుడోత్సవము |
| | 9 | సో | వి 1-7 జ్యే 58-41 త్యా 4-24 |
| | 10 | మం | త 5-39 మూ 60-10 |
| | 11 | బు | చవి 9-54 మూ 4-26 త్యా 4-24 |
| | 12 | గు | పం 13-37 పూషా 9-43 సిద్ధియోగః |
| | 13 | శు | ష 16-32 ఉషా 14-16 |
| | 14 | శ | స 18-30 శ్ర 17-51 అష్టమితిథిః |
| | 15 | ఆ | అ 19-19 ధ 20-62 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలలు, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ రుగ్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0    6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది మాగిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించినపై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0    6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భపాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారా. జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు.

భారత ప్రశస్తి




లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

Lodhra Press, Madras-14.